# ఎమర్జన్సీ కాళరాత్రులు - నా అనుభవాలు

అది 1975 సం॥ జూన్ 26వ తేది. ఉదయం గం॥5-00లు. మా మామగారు స్వర్గస్థులై అప్పటికి 5 రోజులైంది. కృష్ణాజిల్లా నందిగామలోని మా స్వగృహం వరండాలో కూర్చొని, మామగారి కర్మకాండల ఏర్పాట్లు చూస్తున్నాను. మా బావమరదులు చిన్నవారు కావటం వలన ఆ బాధ్యత నా మీద పడింది. ఇంతలో మఫ్టీలోవున్న హెడ్‌కానిస్టేబుల్ వచ్చి "దొరగారు (D.S.P.) బంగళాలో ఉన్నారు. తమతో మాట్లాడాలిట! తమర్ని రమ్మనమన్నారు" అని చెప్పాడు. "ఇంత ప్రొద్దున్నే నాతో పని ఏమిటి?" అన్నాను. "నాకు తెలియదు సార్! అర్జంటుగా రమ్మనమన్నారు" అన్నాడు. వస్తానులే అని చెప్పి అతనిని పంపించి నా పనిలో నిమగ్నమైపోయాను. ఆనాడు రోజూ వచ్చే దిన పత్రికలు రాలేదు. రేడియో మూగబోయింది. ఫోన్ పనిచేయటంలేదు. అయినప్పటికీ వాటిని గురించి అంతగా పట్టించుకోక నా పనిలో నిమగ్నమైపోయాను. మరి 15 ని॥లలో సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ వచ్చి "దొరగారు బయలుదేరుతున్నారు సార్. తమర్ని వెంటబెట్టుకొని తీసుకొనిరమ్మనమన్నారు" అన్నాడు. ఇంట్లో కూడా చెప్పకుండా, అతని వెంబడి నడచి గేటు వద్దకు వచ్చాను. ఎదురుగా మా సబ్‌ఇన్‌స్పెక్టర్ వచ్చి "నమస్తే! అని సారీ! సార్!" అన్నాడు. ఇంతలో మా ఇంటి నలుమూలలా దాగిఉన్న కానిస్టేబుల్స్ కూడా పరుగెత్తుకొని వచ్చి నన్ను చుట్టుముట్టారు. అర్థమైందిలే! అంటూ ముందుకు నడిచాను. ఇంతలో ప్రక్కనే ఉంచిన పోలీస్ వ్యాన్‌ను స్టార్ట్ చేసి, నా దగ్గరకు తీసుకొని వచ్చి ఎక్కించి, పోలీస్ స్టేషన్‌కు తీసుకుని వెళ్ళారు.

అక్కడకు వెళ్ళిన తరువాత నన్ను ఎందుకు తీసుకొని వచ్చారు? అని అడుగగా "మాకు తెలియదు సార్! తమర్ని వెంటనే తీసుకొని రమ్మనమని, విజయవాడ నుంచి వైర్‌లెస్ వచ్చిందని ఎస్.ఐ. సమాధానం చెప్పాడు. అక్కడ నుంచి ఇంటికి కబురుపంపగా, నా బట్టలు, సూట్‌కేస్ తీసుకొని, మా కుటుంబ సభ్యులు హడావిడిగా పోలీస్‌స్టేషన్‌కు వచ్చారు. పొంగిపొరలి వచ్చే దుఃఖమును ఆపలేక కండ్లు తుడుచుకుంటూ నా ఎదుట నిలబడ్డారు. నా పిల్లలందరూ తొమ్మిది సంవత్సరాలలోపువారే (ఐదుగురు) కావటం వలన, వారికి పరిస్థితి అర్థంకాక అమాయకంగా చూస్తూ నిలుచున్నారు. నా శ్రీమతి పడుతున్న వేదన నాకు బాగా అర్థమైంది. అయితే నేను నిస్సహాయుడను గదా! నేను ఏమి చేయగలను? వారు పడుతున్న బాధలో నేనూ పాలు పంచుకున్నాను. అంతే.. ఇంతలో చాలామంది జనం కూడా అక్కడ చేరారు. తలా ఒక విధంగా గుసగుసలాడుతున్నారు. ఏదో తప్పుచేసి వుంటాడు. పోలీసులు తీసుకొనివెళ్ళుతున్నారని, ఆ జనంలో కొందరు భావించి ఉండవచ్చును. ఇది సమాజం కదా! ఎవరి భావం వారిది, ఎవరి బాధ వారిది.

నేను ఏ తప్పూ చేయలేదనే ధీమాతో, ఆత్మవిశ్వాసంతో నుంచున్నాను. నా మొర ఆలకించేదెవరు? నా గోడు అప్పుడు ఎవరు వింటారు? అయితే ఒకటి మాత్రం సత్యం. లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ, స్వేచ్ఛా స్వాతంత్ర్యముల కోసం నడుపుతున్న మహోద్యమంలో, ఆంధ్రప్రదేశ్‌లో ఆ ఉద్యమాన్ని నిర్వహిస్తున్న రథసారథులలో నేనూ ఒకడననే విషయం అప్పుడు ఎవరు పట్టించుకుంటారు? విజయవాడకు జె.పి.ని ఆహ్వానించడానికి, ఏర్పాటైన ఆహ్వాన సంఘమునకు ప్రధాన కార్యదర్శిగా వుండి, ఆ సభలను జయప్రదం చేసిన విషయం ఎవరికి గుర్తువుండి ఉంటుంది? ఉత్సాహంగా ఉద్యమం జరుగుతున్నప్పుడు నినాదాలిస్తూ కేరింతలు కొడుతారు. ఏమాత్రం ప్రమాదం కనిపించినా చాలు! మాకు పట్టనట్లు, ప్రేక్షకులుగా చూస్తూ నిలబడిపోతారు. ఇది వారి సహజ లక్షణం.

పోలీస్ వ్యాన్ గం॥10-00లకు విజయవాడ చేరుకొనిన తరువాత అసలు విషయం తెలిసింది. 25వ తేదీ రాత్రే ఎమర్జన్సీ దేశంలో విధించబడిందని తెలుసుకున్నాను. అప్పటికే విజయవాడలో 'మీసా' క్రింద అరెస్టు చేసి తీసుకొనిరాబడిన శ్రీయుతులు యం.వి. రామమూర్తి, గొట్టిపాటి మురళీ మోహన్, అట్లూరి శ్రీమన్నారాయణ, ఐతా రాములు ప్రభృతులు నా రాక కోసం ఎదురు చూస్తున్నారు. యావత్ ఆంధ్రప్రదేశ్‌లో 'మీసా' క్రింద అరెస్టు చేయబడిన బ్యాచి మాదే మొదటిది కావడం విశేషం. మా ఐదుగురిని సాయంత్రానికల్లా రాజమండ్రి సెంట్రల్ జైలుకు తీసుకొని వెళ్ళారు. ఆ విధంగా 1975 సం॥ జూన్ 26న రాజమండ్రి సెంట్రల్ జైలులో అడుగుబెట్టిన నేను, లోక్‌సభ ఎన్నికలు ప్రకటించిన (ది. 18-1-1977) తరువాత ది. 21-1-1977 (షుమారు 19 నెలలు)న విడుదలైనాను. నేను జైలులో వున్నప్పుడు నా మరదలు వివాహం మా ఇంట్లోనే జరిగింది. కాని నాకు 'పెరోల్' కూడా ఇవ్వడానికి నిరాకరించింది ప్రభుత్వం. (చాలా మందికి పెరోల్స్ యిచ్చారు). ఈ విధంగా షుమారు ఒక లక్షాపదివేలమంది కారాగారాలలో 19 నెలలపాటు మ్రగ్గిపోయారు. పత్రికలమీద సెన్సార్ షిప్ విధించబడింది. ఆల్ ఇండియా రేడియో ప్రభుత్వ బాకాగా మారిపోయింది. జైలుకు వచ్చే లేఖలు, జైలు నుండి వెళ్ళే లేఖలు సెన్సార్ చేయబడేవి. సకాలంలో చేరేవికావు. ఒకవేళ చేరినా తారుపూసి యిచ్చేవారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కాలరాచివేయడానికి 42వ రాజ్యాంగ సవరణను కూడ ప్రభుత్వం చేసింది. సర్వాధికారాలను చేబట్టింది. లోక్‌సభలో సి.పి.ఐ. మాత్రం మిత్రపక్షంగా ఎమర్జన్సీని సమర్థించింది. మిగతా ప్రతిపక్ష సభ్యులనందరిని జైళ్ళకు పంపించింది. అయితే భారతదేశ ప్రధమ సభాపతి జి.వి. మౌళంకర్ కుమారుడు పి.వి. మౌళంకర్ ఒక్కడే ఆనాడు లోక్‌సభలో ఉండటం విశేషం. ఆయన మాత్రం 42వ రాజ్యాంగ సవరణ ఆమోదిస్తున్న సమయంలో, ఆవేదనతో "ఈ రోజు జాతి చరిత్రలో అత్యంత విచారకరమైన దినం" అని ధైర్యంగా ప్రకటించాడు.

స్వేచ్ఛకు సంకెళ్ళు వేయబడిన దుర్దినం. ఎమర్జన్సీ ప్రకటించబడిన కాళరాత్రి (రాత్రి గం॥11-45ని॥). అదే జూన్ 25, 1975. నేటికి సరీగా 25 సంవత్సరాలైంది. ప్రభుత్వ నిరంకుశ కర్కశ విధానాలను భారతజాతి 19 నెలలపాటు చవిచూడవలసి వచ్చింది. స్వేచ్ఛకు సంకెళ్ళు వేయబడ్డాయి. విధేయులు మాత్రం విశృంఖలంగా, విచ్చలవిడిగా స్వైరవిహారం చేశారు. వారి దుశ్చర్యలకు ఎందరో బలైపోయినారు. ఎన్నో కుటుంబాలు సర్వనాశనమైపోయినాయి. ఆర్థిక వ్యవస్థలు తారుమారైనాయి. అట్టి బాధితులలో నేను కూడా ఒకడను కాబట్టి, వేదనలను, ఆవేదనలను, బాధలను, వ్యధలను చవిచూచిన కుటుంబాలలో నాది కూడా ఒకటి కాబట్టి, ఆనాటి కాళరాత్రులు ఈనాడు నా మదిలో మెదిలాయి. పర్యవసానమే ఈ చిన్ని సమీక్ష.

సహృదయంతో దీనిని స్వీకరించి, ఆనాటి చీకటి రాత్రులు మన దేశంలో పునరావృతం కాకుండా పాలకులను, పార్టీలను హెచ్చరిస్తారని, ప్రజాస్వామ్య పరిరక్షణకు పౌరులుగా తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను.

మచిలీపట్నం,
ది. 26-6-2000

(కొమరగిరి కృష్ణమోహనరావు)

జూలై 2000
సంపుటి 16 సంచిక 7

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా | | |
| (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-07-2000**

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం
గ్రంథాలయోద్యమ పితామహ **శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య**




# శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య (1890 - 1979)

ఆయన జీవితమే ఒక ఉద్యమం. సరస్వతీ సేవలకై అవతరించి జీవితాంతము, గ్రంథాలయ ఉద్యమంలో సేవలు చేసి 89 ఏళ్ళు జీవించి కన్నులు మూసిన మహనీయుడు శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య. ఆయనకు ముగ్గురు కుమారులు, నల్గురు మనుమలు ప్రసిద్ధ కూచిపూడి నృత్యకారుడు తాండవ కృష్ణ ఈయన పుత్రుడు.

తూర్పుగోదావరి జిల్లా కొంకుదురు వీరి జన్మస్థలం. జూలై 24, 1890లో జన్మించారు. తండ్రి వెంకటరత్నం. తల్లి మంగమాంబ. తండ్రి డెల్టా సూపరింటెండెంట్ ఉద్యోగం చేశారు. సంపన్న కుటుంబంలోని ఏకైక పుత్రుడు. గారాబంగా పెరిగాడు. ప్రాథమిక విద్య తూర్పుగోదావరి జిల్లా అత్తిలి. పిదప నరసాపురం డైలర్ మిషన్ స్కూలులో చదువు 1907లో రాజమండ్రి బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసం విని గౌతమీ నదిలో స్నానంచేసి దేశ సేవకు జీవితం అంకితం చేయగలనని "రక్షాబంధనం" కట్టుకొని చదువులు మానివేస్తాడు. ఈ సభలోనే చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు 'భరతదేశము పాడియావు' అనే పద్యం చదివినారు. పిదప 1908-1909 బందరులో జాతీయ కళాశాల స్థాపకులు కోపల్లె హనుమంతరావు, కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభిరామయ్యగార్ల వద్ద రాజకీయ శిక్షణ పొందారు. ఈ సమయంలోనే "ఆంధ్రభారతి" సచిత్ర మాసపత్రిక బందరులో ప్రారంభించారు. 1911లో విజయవాడ రామమోహన ధర్మ పుస్తక భాండాగారాన్ని స్థాపించి దానికి కార్యదర్శిగా చిరకాలం సేవలు అందించారు. ఇది పూర్వం బ్రహ్మసమాజంవారి ఆస్తిక పుస్తక సమాజం అని ఉండేది. దానిని జీర్ణావస్థ నుండి పునరుద్ధరించి నామధేయం రామమోహన గ్రంథాలయం అని పెట్టి అత్యంత కృషి సేవాభావంతో వృద్ధి చేశారు. రామమోహన గ్రంథాలయం, ఆనాటి స్వాతంత్ర్య పోరాట సమయంలో బహిరంగ ఉపన్యాసాలకు, అజ్ఞాత సోషలిస్టు కార్యకర్తలకూ నిలయంగా ఉండేది. శ్రీ సూరి వెంకట నరసింహంగారు; నేటికీ బీసెంటురోడ్డులోని, మునిశాల భవన నిర్మాణానికి అయ్యంకి వారికి చేదోడువాదోడుగ నిలచారు.

**గ్రంథాలయోద్యమ ప్రారంభం :** 1914 సం॥ ఏప్రిల్ 10 ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ భాండాగార ప్రతినిధుల (లైబ్రేరియన్లు) ప్రథమ మహాసభ విజయవాడలో అయ్యంకి వారు పెద్ద పెట్టున నిర్వహించారు. ఇది వారి తొలి మెట్టు. దీనికి చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు హాజరైనారు. వారి ముగింపు వాక్యాలే "గ్రంథాలయవేదం" క్రింద నేటికీ వ్యవహరింపబడుతోంది. ఆ అమూల్య సందేశం వ్యాసం చివర ఉదహరింపబడింది. ఎంతో ఉత్తేజకరమైన సందేశం చిలకమర్తివారు అందించారు. 1915లో "గ్రంథాలయ సర్వస్వం" త్రైమాస పత్రికగా నెలకొల్పబడి నేటికీ మాస

**డా॥ రాపర్ల జనార్దనరావు**

పత్రికగా నిర్వహింపబడుతోంది. 1916లో స్వంత ఖర్చులతో బరోడా మహారాజు శ్రీ శాయాజీరావు గైక్వాడ్ ప్రభుత్వం తరఫున స్థాపించి వృద్ధి పరచుచున్న గ్రంథాలయోద్యమాన్ని పరిశీలించి రావటం అయ్యంకివారి జీవితంలో ఒక స్ఫూర్తిదాయకమైన సంఘటన. మరల 1935లో అయ్యంకివారు ఉద్యమంలో ఎంతో ఎత్తు ఎదిగి బరోడా మహారాజు వజ్రోత్సవాలకు హాజరై రాజావారికి "సరస్వతీ సామ్రాజ్యరమారమణ" అనే బిరుదు ప్రసాదించి అచటివారి మన్ననలను పొందారు.

**గ్రంథాలయోద్యమం ఎలా సాగించారు :** నిరక్షరాస్యులైన భారత ప్రజలకు, కొద్దిపాటి అక్షరాస్యులకు, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో గ్రంథాలయములు నెలకొల్పటానికి, ప్రజలలో గ్రంథ పఠనాసక్తి పెంపొందించుటకు, వీరు నాయకులై అనేకమంది సహృదయులను తోడ్పడచేసి ఉద్యమకర్తగా వీరు చేసిన కృషి ప్రపంచ చరిత్రలోనే ఎచ్చటనూ కన్పింపదు అని పలువురు దేశం నలుమూలల నుండి ప్రశంసలు అందించారు. దీనిలో గాంధీజీ సిద్ధాంతాలు, జాతిని మేల్కొలుపజేసే సామాజిక దేశభక్తి

పూరిత లక్ష్యాలు, జోడింపబడి ఉన్నాయి. జాతీయోద్యమం, గ్రంథాలయ ఉద్యమం రెండునూ భరతమాతకు జన్మించిన కవల పిల్లలు అనటంలో అతిశయోక్తిలేదు. ఆ రోజుల్లో ఈ రెండు ఉద్యమాలు నిరంతర ప్రజాసేవయే లక్ష్యముగా సాగినవి.

**శిక్షణా శిబిరాలు :** 1920లో గ్రంథాలయ శిక్షణా శిబిరాలు ప్రారంభింప బడి పలుతావుల యుందు ఇవి సంవత్సరాల తరబడి నిర్వహింపబడినాయి. ఈ శిక్షణా శిబిరాలలో దేశ నాయకులు ఉపన్యసించేవారు. జాతీయోద్యమానికి ఇది ఒక బాటగా ఏర్పడింది. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు, కామవరపు రామదాసు పంతులు, ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం, నరసింహదేవర సత్యనారాయణ, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, దేశబంధు అయ్యదేవర కాళేశ్వరరావు, చెరుకువాడ నరసింహం పంతులు మొదలైన రాజకీయ దురంధరులు, గ్రంథాలయ శాస్త్రంలో నిపుణులు, కొరారి రామారావు, పుణ్యమూర్తుల రాజశేఖర్‌గారు, యం.ఓ. థామస్ ఉపన్యసించేవారు శిక్షణా శిబిరంలో. ఇది 1942 బందరు మున్సిపల్ లైబ్రరీలో జరిగింది. గ్రంథాలయ కార్యకర్త ఎట్లుండవలయును, అతనికి కావలసిన లక్షణములు. గ్రంథాలయమునందలి పుస్తకముల వర్గీకరణ (క్లాసిఫికేషన్), సూచీకరణ (కేటలాగింగ్), పుస్తకముల సంరక్షణ (మెయిన్‌టెన్) గ్రంథాలయ పరిశుభ్రత, చిత్రపట ప్రదర్శనము మొదలగు విధానముల ఆకర్షణీయత (ఎట్రాక్షన్) పెంపొందించుట, చదువరులయెడ వ్యక్తిగత సేవలు (పర్సనల్ నీడ్స్ ఆఫ్ ది రీడర్సు) గ్రంథాలయ మందలి పుస్తకముల విషయము అంతయు విహంగ వీక్షణము (బర్డ్స్ ఐ వ్యూ) కలిగి ఉండుట. గ్రంథాలయములు ఇచ్చి పుచ్చుకొనుటయందలి ఓర్పు నేర్పులు, గ్రంథాలయ విస్తరణకు పుస్తక సేకరణ, ధన సేకరణ. ముఖ్యమైన గ్రంథాలయములు ఎట్లు నిర్వహింప బడుచున్నవి, ఆధునిక పద్ధతుల గూర్చి ప్రత్యేక ఆహ్వానితుల తోడి ఉపన్యాసములు ఎన్నో ఆసక్తి దాయక విషయములు నేర్పబడెడివి.

**గ్రంథాలయోద్యమానికి తోడ్పడిన మహామహులు :** సర్వశ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, పాతూరి నాగభూషణం, శరణం రామస్వామి చౌదరి, సూరి నారాయణమూర్తి, కలిదిండి నరసింహరాజు, యస్.వి.యస్. నరసింహామూర్తి, డాక్టర్ వెలగా వెంకటప్పయ్య గారు ప్రసిద్ధులు. ప్రొఫెసర్ కాట్రగడ్డ శారదగారు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ ప్రగతి పైన మాస్టర్సు డిగ్రీ పొందారు. అయ్యంకి వారికి డా॥ శారద అంటే ఎనలేని ప్రేమ. శ్రీమతి యస్. ఉమాదేవి అయ్యంకి వారిపై సిద్ధాంత వ్యాసం వ్రాసి గ్రంథాలయ శాస్త్రంలో మాష్టర్సు డిగ్రీ పొందారు.

గ్రంథాలయోద్యమ సేవలో ప్రముఖ పాత్ర నిర్వహించిన ప్రసిద్ధులు. శ్రీ ఆర్. జనార్ధనం నాయుడు, శ్రీ మునీంద్ర దేవ్‌రాయ్, శ్రీ సంత్‌రాం భాటియా, శ్రీ శనివారపు సుబ్బారావు, శ్రీ గాడిచెర్ల హరి సర్వోత్తమరావు (ఎనలేని కృషి చేశారు.) శ్రీ నిడదవోలు వెంకటరావు, శ్రీ రుద్రరాజు నరసింహంరాజు. శ్రీ పప్పూరి రామాచార్యులు పండిత గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావు, శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావు, శ్రీ వెలగా వెంకటప్పయ్య, శ్రీ మల్లెల శ్రీరామమూర్తి, శ్రీ కోదాటి నారాయణ రావు, శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ వెల్లంకి ప్రసాద్, డా॥ అల్లూరి నరసింహరాజు, శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మి, శ్రీ కొల్లూరి కోటేశ్వరరావు, శ్రీ దేకుమళ్ళ రామ చంద్రరావు, శ్రీ మాజేటి రామచంద్రరావు, శ్రీ మండవ శ్రీ రామమూర్తి, శ్రీ కలపాల సూర్య ప్రకాశరావు, శ్రీ గద్దె రామ మూర్తి, శ్రీ పాతూరి విజయకుమార్, ఇంకా ఎందరెందరో ప్రముఖులు శ్రీ అయ్యంకి వారికి ఉద్యమంలో తోడ్పడ్డారు.

**గ్రంథాలయ యాత్రలు :** ముఖ్యముగ అయ్యంకి వారు దేశ సౌభాగ్యమునకు గ్రామసీమలే మూలకందములని గ్రామ సీమలకు వినోభాభావే, గాంధీజీల స్ఫూర్తితో, కాలి నడకన పాదయాత్రలు గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో నిర్వహించారు.

## విదురనీతి

"న దిష్టమభ్యతిక్రాన్తుం శక్యం భూతేనకేన చిత్
దిష్టమేవ ధ్రువం మన్యే పౌరుషం తు నిరర్ధకమ్"

ఏ ప్రాణికైనను ప్రారబ్దమును అతిక్రమించుట అశక్యమైనది. ప్రారబ్దమే అచంచలమైనది. దానియందు పురుష ప్రయత్నము నిరర్ధకమే అగును.

ప్రచార సాధనాలు : భజనలు, కోలాటాలు, తప్పెట్లు బుర్రకథలు, ఉపన్యాసములు. వీనిద్వారా అయ్యంకి వారు "గ్రంథాలయోద్యమ నా తపస్సు" అనెడి వారి ప్రగాఢ వాంఛను నెరవేర్చుకుని చరితార్థులైనారు.

**అయ్యంకి వారి గ్రంథాలయోద్యమ విశిష్టత :** తొలిసారిగా ఆంధ్ర తెలంగాణా గ్రంధాలయ సమైక్యత సురవరం ప్రతాప రెడ్డి, వెంకట్రామిరెడ్డి మొదలైనవారి సమైక్యతతో "విశాలాంధ్ర"కు నాంది పల్కినారని తెల్పవచ్చును. ఆంధ్ర దేశమున ఉద్యమము స్థాపించి బెంగాలు, మహారాష్ట్ర, ఇతర రాష్ట్రములలో విస్తరింపజేయుట, అయ్యంకివారి దీక్ష, సేవా తత్పరత నేతృత్వ లక్షణములకు తార్కాణము. విజయవాడ, బీసెంటురోడ్డులోని తమ గృహమందు "సరస్వతీ సామ్రాజ్యము" ఆనాటి ఉపరాష్ట్రపతి వి.వి.గిరిగారు, కేంద్ర మంత్రి శ్రీ కె.యల్.రావుగార్లచే ప్రారంభింపజేశారు. అసలు 'సరస్వతీ సామ్రాజ్యం' అనే పేరులోనే ఎంత ఘనమైన భావాన్ని నిక్షిప్తం చేశారో మనం అర్థం చేసుకోవచ్చు. ఇంతటి మహత్తర సేవకు గుర్తింపుగా శ్రీ అయ్యంకి వెంకట రమణయ్య పంతులు గారికి 1977లో విశిష్ట సేవా పతకం **"ప్రొఫెసర్ కౌలా అంతర్జాతీయ స్వర్ణపతక ప్రదానం"** జరిగింది.

**అయ్యంకివారి జీవిత విశేషాలు :** అనేక ఉద్యమాలలో ప్రత్యేక సేవలు అందజేసి, విశిష్ఠ స్థానాన్ని పొంది 89 ఏళ్ళ సంపూర్ణ జీవనం పిదప కన్ను మూయుట వారి జన్మ సాఫల్యం. గాంధీజీ ఉప్పు సత్యాగ్రహ ఉద్యమంలో బందరు చిన్నాపురంలో పాల్గొన్నారు. గాంధీజీ విజయవాడ వచ్చినప్పుడు సేవాదళ కార్యక్రమం ఆంధ్రరత్న దుగ్గిరాల వారి **"రామదండు"** లో చేరి సేవ చేశారు. అనీబిసెంటుతో దివ్యజ్ఞాన సమాజంలో చేరి దివ్య జ్ఞాన సమాజానికి బాలభటు (స్కౌట్సు) ఉద్యమానికి ఎనలేని సేవలు చేశారు.

జర్నలిస్టుగా పత్రికారంగంలో 'ఆంధ్రభారతి' (3 సం॥) "గ్రంధాలయ సర్వస్వం త్రైమాసిక (4 సం॥) "ఇండియన్ లైబ్రరీ జర్నల్" ఆంగ్లం త్రైమాసిక (4 సం॥), "కౌరడా", "ప్రకృతి", "Indian Naturopathy", 'సహకారం'మాసపత్రిక, "దివ్య జ్ఞానదీపిక" ఇంకా ఎన్నో పత్రికలతో సంబంధం.

**శ్రీ అయ్యంకివారి వ్యక్తిత్వం :** విశాలమైన ఫాలభాగం, ప్రశాంతమైన రూపం, పట్టుకుచ్చువంటి తెల్లని ఉంగరాల జుట్టు మెడవరకు ఠీవిగా ఈతడు జ్ఞానియని చూపరులకు తెలిపేలాగాన వ్రేళ్ళాడటం, కార్యశూరునిగ నిండైన మీసాలు, మృదుభాషణ ఆత్మీయత, దేశభక్తి, అన్ని వర్గాల వారిని సమీకరించి కార్యోన్ముఖులను చేసెడి విశిష్ఠ మానసిక స్థితి. తాను తరించుటయేగాక ఇతరులను తరింపజేస్తాడో "తర్ణం పరాస్తారయతి" తాను బాగుపడి తోడివారలను తోడివారిని బాగుచేయవలెనని తపన శ్రీ వి.వి. గిరిగారు వీరిని గూర్చి వర్ణించటం. వీరి జీవిత విశేషాలు. తెల్లని ఖద్దరు లాల్చీ, పైన శాలువా, పంచ, బిళ్ళ గోచీ, నిండైన ఆరోగ్యమైన శరీరం చూపరులకు ఆనందాన్నిచ్చేది. "మీ ఆరోగ్య రహస్యాలు చెప్పండి" అని కోరితే "నిత్యం కృష్ణస్నానం, దానిలో ఈత, ఒడ్డున ఒండ్రుమట్టి స్నానం, ప్రకృతి ఆహారం ఇవి వారి 89 సం॥ దీర్ఘాయువుకు రహస్యాలు అనేవారు. ముఖ్యమైన సేవలు మూడు. 1) గ్రంథాలయోద్యమం 2) దివ్యజ్ఞాన సమాజం 3) ప్రకృతి వైద్యం.

**పొందిన బిరుదులు :** 'గ్రంథాలయోద్ధారక', "గ్రంధాలయ శాస్త్ర విశారద", "గ్రంథాలయ పితామహ", "సరస్వతీ సామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్య". బేడెన్‌పవెల్ బాలభటోద్యమ నాయకులు వీరికి స్వయంగా 'బాడ్జి'ని ప్రదానం చేశారు. భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' 1972లో ఇచ్చి సత్కరించింది.

**వారి సూక్తులు :**

1. గ్రంధాలయోద్యమం బీదది. భాగ్యవంతమైనది
2. గ్రంథాలయం - మౌన సరస్వతీ నిలయం
3. చిరుదీపం వెలిగించు - దీపం చిన్నదైనా పెద్ద దీపాన్ని వెలిగించవచ్చు.
4. గ్రంథ భాండాగారి (లైబ్రేరియన్) సహనం కలిగి ఉండాలి.
5. గ్రామ చరిత్రలు వ్రాయబడాలి, అవి దేశ చరిత్ర అవుతుంది.

## ఆణిముత్యాలు - అనుభవ సత్యాలు

1. **కానున్నది కాకమానదు, రానున్నది రాక మానదు.**
2. **కాపురం గుట్టు, రోగం రట్టు.**
3. **ఉప్పులేని పప్పు, ఉపకారము చేయని మనిషి రెండూ రెండే.**
4. **కాలం గడిచిపోవును, మాట నిలిచి పోవును.**
5. **కాలుజారితే తీసుకోగలంగాని, నోరుజారితే మాత్రం తీసుకోలేం.**

# హిరణ్యకుని పూర్వకథ

చంపకవతి అనే పట్టణం వుండేది. ఆ పట్టణంలో చాలామంది సన్యాసులు నివసిస్తూ వచ్చారు. వాళ్ళలో చూడా కర్ణుడనే సన్యాసి ఒకడు వుండేవాడు. అతడు ప్రతి దినం భిక్షమెత్తి అన్నం తెచ్చుకొనేవాడు. తాను తినగా మిగిలిన వంటకాన్ని భిక్షాపాత్రలో పెట్టి చిలుకకొయ్యకు తగిలించి నిద్రపోతుండేవాడు. అప్పుడు హిరణ్యకుడు సద్దు లేకుండ దాని మీదకి ఎగిరి నిత్యం ఆయన్నాన్ని భక్షించిపోయేవాడు.

ఒకనాడు చూడాకర్ణుడు తన మిత్రుడు వీణాకర్ణునితో మాటలాడుతూమాటిమాటికి చిలుకకొయ్య వైపు చూస్తూ తన గిలక కఱ్ఱతో నేల మీద కొట్టి ఆ ఎలుకను భయ పెడుతూ వచ్చాడు. అప్పుడు వీణాకర్ణుడు "చూడాకర్ణా! ఏమది? పైకి చూసి నేలమీద కఱ్ఱతో కొడుతున్నావు?" అని అడిగాడు. చూడాకర్ణుడిలా చెప్పాడు. 'ఒక మూషికం ప్రతిదినం చిలుకకొయ్య మీదికి ఎగిరి పాత్రలో వుండే అన్నం తినిపోతూంది. నాకు దీని పోరు పెద్దదిగా వుంది'. అనగా విని వీణాకర్ణుడు, "ఎక్కడ ఎలుక! ఎక్కడ చిలకకొయ్య! ఇంత చిన్నప్రాణికి ఇంత యెత్తునకెగిరే బలం ఎక్కడి నుంచి వచ్చింది? దీనికేమైనా కారణం తప్పకుండా వుంటుంది. లేకపోతే, ఈ తావు విడిచి పోకుండ, దీనికింత బలం కలగటానికి ఆస్కారమే లేదు" అని చెప్పాడు.

చూడాకర్ణుడదివిని, "చాలా కాలం నుంచి ఈ మూషికం ఒక కలుగును తావు చేసుకొని వదలకుండ వసిస్తూ వుంది. ఇల్లా వాసం చెయ్యటానికి కారణం తెలిసింది కాదు. తవ్వి చూస్తాను" అని యెంచి, ఒక గడ్డపాఱతో హిరణ్యకుడు నివశించే బొరియను తవ్వి చాలా కాలం నుంచి కూడబెట్టిన దానిధనాన్నంతా కాజేశాడు. తరువాత హిరణ్యకుడు ఆ బలం, వుత్సాహం నశింపగా, దినదినానికి ఆహారం కూడ సంపాదించుకోలేక దిగులుపడి బక్కచిక్కి మెల్లమెల్లగా తిరుగుతూ వుంటే, చూసి చూడాకర్ణుడు ఇలా అనుకొన్నాడు. "ధనం కలవాడే బలవంతుడు. ధనం వున్నవాడే పండితుడు. సకలశ్రేయస్సులకు ధనమే మూలం. ధనం లేనోడి బతుకెందుకు? ఈ ఎలుక తన ధనం పోగొట్టుకొని కదా, ముందట శక్తి సామర్థ్యాలు నశించి మామూలు ఎలుకగ మారిపోయింది. ధనం లేనోడికెప్పుడూ దుఃఖమే సంభవిస్తు వుంటుంది. ఆ దుఃఖం వల్ల బుద్ధిహీనత ప్రాప్తిస్తాది. దాని వల్ల అన్ని పనులు ఎండాకాలపు ఏటివెల్లవల మాదిరి ఎక్కడివక్కడ నశించిపోతాయి. ధనవంతుడికే బుద్ధి సంపద. బంధు మిత్రులు కలుగుతారు. దరిద్రుడు బతికినంత కాలం తీవ్రమైన వేదనలకు గుఱియవుతూ వుంటాడు. డబ్బు వున్నప్పుడే మనిషి తెలివితేటలు వికసించి, పేరు ప్రఖ్యాతులు పొందుతాడు. అది పోయిన క్షణమే పలకరించే వాళ్ళుండరు. ఇది వింతల్లోకెల్ల మఱీ వింత"!. అని యాసన్యాసి చెబుతుండగా హిరణ్యకుడు నీళ్ళుగారి పోయి ఇలా చింతించాడు. 'ఇంక నేనిక్కడ వుండటం మంచిది కాదు నాసంగతి ఇతరులతో చెప్పుకోవటం గూడ సిగ్గు చేటు. పూల గుత్తిమాదిరి మానముున్నవాడు. అందఱి తలల మీదనైనా ఎక్కాలి లేదా తానుండే వనంలోనైనా కృశించిపోవాలి.

యం. మునికృష్ణారెడ్డి

ఇక్కడనే వశిస్తూ భిక్షం ఎత్తుకొని బతుకదామంటే, దానికంటే చావడం మేలు" అని యెన్నో విధాలుగా విచారించింది. కాని, ఆశాపాశాన్ని తెంచుకోలేక, మళ్ళీ ధనం సంపాదించాలనే కోరికతో అక్కడనే వుండసాగాడు.

హిరణ్యకుడు ఆ తావు వదలకుండటం చూసి, చూడాకర్ణుడు ఒక నాడు దానిపై కఱ్ఱ విసరివేశాడు. దైవవశాన ఆ దెబ్బ తప్పిపోయింది. ఆ తరువాత హిరణ్యకుడు ఇలా అనుకున్నాడు. "ఆహా! ధనాశ కష్టాలన్నిటికి కారణం గదా! దాన్ని విడిచి పెట్టటం కంటె లోకంలో మరో సుఖంలేదు. ఆశ వదులుకొన్నోడే సుఖపురుషుడు. వాడే అన్ని శాస్త్రాలు చదివినోడు. వాడే అన్ని ధర్మాలు చేసినోడు. దొరికినదాంతో తృప్తిపడేవాడే లోకంలో ధన్యుడు. ఈ తావు తాతముత్తాతలు సంపాదించిన కాణాచి కాదు. ఈ భూమిలో ఇంక తావేదొరకదా! ఇక్కడే వుండి ఈ బోడి సన్యాసిగాడి కఱ్ఱ దెబ్బలు తిని ప్రాణాలు పోగొట్టుకోవడమెందుకు? ఎక్కడైనా ఒక ఏకాంత ప్రదేశంచేరి కాలం గడపడం మంచిది. ఱాతిలో వుండే కప్పను పోషించే దయామయుడైన ఆ సర్వేశ్వరుడు నన్ను కాపాడకుండ పోతాడా?" అని మనసు గట్టిపరుచుకొని, ఆ తావు విడిచిపెట్టి ఒక జనసంచారంలేని అడవికి చేరింది. అక్కడనే దానికి లఘుపతనకమనే కాకితో స్నేహం కలిగింది. మంధరుడనే తాబేటి ఆశ్రయమున్ను లభించింది. ఆపైన ఆ మిత్రులతో మూషికం సుఖంగా కాలం గడపసాగింది.

నీతి : భద్రత కరువైన తావును వీడిపోవడమే శ్రేయస్కరం.







# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ట్రస్టు

(రిజిష్టరు నెంబరు 18/94)

**తి.తి. దేవస్థానముల పరిపాలన భవనం, కె.టి.రోడ్డు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)**

**డా॥ ఐ.వి. సుబ్బారావు,** ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వాహణాధికారి

**ప్రియమైన దాతలకు,**

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. మనదేశంలో ఆకలిగొన్న వారికి, పేదవారికి అన్నదానం చేయుట మన్నది కేవలం సేవ మాత్రమేకాదు, వేదకాలం నుంచి వస్తున్న పవిత్ర సంప్రదాయం! అన్నదానం చేసిన వారికి దేవతల ప్రక్కన చోటు లభిస్తుందని పెద్దలంటారు.

తిరుమలకు వచ్చే యాత్రికులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించే ఉద్దేశ్యంతో 1985లో "శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ట్రస్టు" ప్రారంభించినప్పటి నుండి అపూర్వాదరణ చూరగొని దేశమంతటి నుండి సహృదయులైన దాతల నుండి విరాళాలు అందుతున్నాయి.

**ఈ పథకం విశేషాలు :**

**I** ఎవ్వరైనా ఐదు లక్షలు దానికి రెట్టింపు మొత్తం (a)ఒక వ్యక్తి, (b)కుటుంబంలో ఐదుమంది కలిపి, (c)రెండు వ్యాపార సంస్థలు కలిపి, విరాళం ఇవ్వవచ్చు వీరికి ఈ క్రింది సౌకర్యాలు లభిస్తాయి.

1. దాతల పేర్లు భోజనశాలలో ప్రదర్శిస్తారు.
2. దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజుల పాటు ఉచిత వసతి ఏర్పాటు చేయబడుతుంది.
3. దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజులు 5 మందికి మాత్రం వైకుంఠం 'క్యూ' కాంప్లెక్సు ద్వారా దర్శనము.
4. దాతలకు శ్రీ వేంకటేశ్వరస్వామి మరియు శ్రీ పద్మావతి అమ్మవారి వెండి బొమ్మలకు బంగారు పూత పూసిన జ్ఞాపిక బహూకరింపబడుతుంది. (ఒక పర్యాయం మాత్రమే)
5. ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు.

సదరు దాతల విరాళాలను జాతీయ బ్యాంకులలో ఫిక్సెడు డిపాజిట్ల ద్వారా ప్రతి ఏటా వచ్చు వడ్డీతో మాత్రమే అన్నదానానికి ఉపయోగింపబడుతుంది. ప్రస్తుతం ప్రతిదినం 15,000 మందికి ఉచిత భోజన సదుపాయం కలుగజేయబడుతున్నది.

**II** 1,000 రూపాయలు లేదా దానికి ఎన్ని రెట్లు మొత్తాన్నయినా, ఈ శ్రీ ఎస్.వి. నిత్య అన్నదాన పథకమునకు విరాళమిచ్చి అవసరమగువారు ఈ మొత్తానికి కూడ ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు పొందవచ్చును.

**III** 5 లక్షల రూపాయలు ఆ పైన ఇచ్చు దాతలకు ఒక వస్త్రము, 10 చిన్న లడ్లు బహుమానముగా ఇవ్వబడును.

**విరాళాలు పంపే పద్ధతి :**

దాతలు విరాళాలను ఏ జాతీయ బ్యాంకు నుండి అయినా "శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదానం ట్రస్టు, తిరుపతి" పేరు మీద డిమాండు డ్రాఫ్టును తీసి "కార్యనిర్వాహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)" వారికి పంపవలెను. ఇతర వివరాలకు

**కార్య నిర్వాహణాధికారి,**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తి.తి.దే. పరిపాలన భవనం, తిరుపతి - 517 501.**

**అన్నదానంతో ఆదుకోండి! ఆత్మ సంతృప్తిని పొందండి!!**

ఈశ్వరమ్మడే సందేశం

# తల్లికి మించిన దైవం వేరే ధరణిలో లేదండి!



"కౌసల్యవరసూక్తి గర్భమవుటన్ గదా
 రాముడు దేవుడై రమణ గాంచె
సీతామహాసాధ్వి చెలగి పెంచుటగదా
 కవలు కుశలవులు తా ఘనులునగుట
జిజియాలలామ చెరగి పెంచుటగదా
 వీరశివాజియు పేరుగాంచె
పుత్తలీబాయి సంభోతమ్మున గదా
 గాంధీ మహాత్ముడై ఘనతి గాంచె
ప్రాణికోటికి మక్కువ ప్రాణముగుచు
 అహరంబును బ్రోచెడి అమ్మకంటె
ధరణి బ్రోచుట వేరెవరు ధన్యులారా
 అమ్మే ఆద్యాక్షరంబు అమ్మకంటెను
 వేరొక్క అదితిలేరు"

ప్రేమస్వరూపులారా!

మానవ జీవిత గమ్యము సుఖముకాదు, దుఃఖము కాదు. ఈ సుఖదుఃఖములు రెండునూ ఎక్కడ ఆవిర్భవించునో, ఆ స్థానముచేతనే మానవుడు ధన్యుడు కాగలుగుతున్నాడు. సుఖము కంటే దుఃఖమునందే మానవుడు అమిత జ్ఞానము సముపార్జించుకోగలుగుతున్నాడు. మహర్షులు దేశమునకు అనేక ఆదర్శములను అందించడానికి, అనేక కష్టములు, నష్టములు, దుఃఖములు, నిందలు, నిష్ఠూరములు అనుభవించడం చేతనే, ఈనాడు మహర్షుల వాక్యములు, భారతీయుల హృదయాలలో స్థిరస్థాయిగా నిలిచినాయి. మానవుడు ఆదర్శ జీవితమును సమాజమునకు అందించవలెననిన, అనేక కష్టములకు గురికావలసి వస్తుంది. కేవలం కష్టములకేకాదు, నిందలకు, నిష్ఠూరములకు కూడా గురికావలసివస్తుంది. కాని మహనీయులు, ఈ నిందలను, నిష్ఠూరములను, కష్టములను లెక్కచేయరు. సమాజమునకు మంచిని అందించటమే వారి లక్ష్యము.

ప్రేమస్వరూపులారా!

సుఖమును మనం ఏవిధంగా ఆహ్వానించుదుమో, అదే విధంగా దుఃఖమునకు కూడా మనం స్వాగతం చేయాలి. సుఖదుఃఖములను రెండింటిని సమదర్శంతో భావించినప్పుడే మానవునియందు సమత్వం ఏర్పడుతుంది మానవునిలో ముఖము చాలా పవిత్రమైనదని భావిస్తారు. అడుగునవున్న పాదములు అపవిత్రమైనవని విశ్వసిస్తారు. అయితే ఒక వ్యక్తి మన గదిలోనికి ప్రవేశిస్తున్నప్పుడు, ముఖమునకు మాత్రం స్వాగతం పలికి, పాదములను Getout అని చెప్పడానికి వీలవుతుందా? ముఖమునకు స్వాగతం చేసినప్పుడు, పాదములను కూడా స్వాగతం చేయాలి. ఈ రెండూ సుఖదుఃఖములతో కూడినటువంటివే.

## భగవాన్ సాయి దివ్యబోధ

ఈనాటి బాలబాలికలే రేపటి పౌరులుగా రూపొందుతున్నారు. రేపటి భారత పౌరులుగా రూపొందుతున్న వీరు, ఎలాంటి వినయ విధేయతలు కలిగి వుండాలి? అనే సత్యమును వీరు గుర్తించాలి. తల్లిదండ్రులను ప్రేమించాలి. బంధువులను విశ్వసించాలి. అక్కచెల్లెళ్ళను, అన్నదమ్ములను కూడా ప్రేమించాలి. ప్రతి మానవుడు ఈ విశ్వమును ఒక కుటుంబముగా భావించి ఆరాధించాలి. ముఖ్యముగా ప్రేమకు మించిన ధనం మరొకటిలేదు. ప్రేమ, ధనమును చెల్లించకుండా, మనకు ఏ వస్తువూ లభించదు. దేనిని పొందవలెననినా, కొంత ధనమును మనం చేకూర్చుకోవాలి. నిత్యం మనం చేకూర్చుకోవలసిన ధనం ఏమిటి? ప్రేమ ధనమునే మనం అభివృద్ధి పరచుకోవాలి. ఈ ప్రేమ ధనం మన చేతిలో వుండిన, సమస్త ప్రపంచం మన చేతియందే వుంటుంది. ఏ నిముషములో ఎక్కడైనా దేనినైనా మనం కొనవచ్చును. సత్య, ధర్మ, శాంతి, అహింసలను కూడా కొనవచ్చును. అన్ని మానవతా విలువలను మనం సులభంగా కొనవచ్చును. కనుక మానవతా విలువలను ఒక్క ప్రేమ ధనముతోనే కొనగలము. ఈనాటి మానవునియందు ఈ మానవతాగుణము క్షీణించడం చేతనే, మనం దేనినీ అందుకోలేకపోతున్నాం.




KOHINOOR
Bangles
Gold Sheet Covered
Acid Proof & Cash Refundable
Estd : 1901 Ph : (08672) 22630
KOHINOOR ROLLED GOLD COMPANY (Regd.)
MACHILIPATNAM - 521 002. A.P. INDIA
WANTED SALES CANVASSERS

మానవుడనగా ఎవరు? మానవతా గుణములను కలిగినటువంటివాడే మానవుడు. మానవుని యొక్క ప్రధాన లక్ష్యము సత్యధర్మములేనని మన భారతీయ సంస్కృతి చెప్పింది. కనుకనే 'సత్యంవద, ధర్మంచర' - ఈ రెండు సూత్రములనే ప్రధానంగా బోధించబడినాయి. మానవుని యందు వ్యక్తిత్వం అభివృద్ధి కావలెననిన, ఈ సత్య ధర్మములే చాలా ప్రధానమైనటువంటివి. సత్యమే ప్రేమ, సత్యమున్న చోట ప్రేమ లభిస్తుంది. ధర్మమున్న చోటనే ప్రేమ ప్రత్యక్షమవుతుంది. ప్రేమను ప్రత్యక్షం గావించు కోవాలంటే, సత్య ధర్మములను మనం అనుసరించాలి. కనుక ప్రధానంగా సత్యమును చెప్పాలి. దీని వలన ఎన్ని కష్టములొచ్చినా వెనుకాడరాదు. సత్యహరిశ్చంద్రుడు సత్యం కోసం పూర్తిగా త్యాగం చేశాడు. కట్టకడపటికి భార్యాబిడ్డ లను కూడా అమ్ముకున్నాడు. తనకు తాను అమ్ముడు పోయి 'కాటికాపరి'గా నిలిచాడు. కాని తాను ఏమాత్రం చింతించలేదు.

"సత్యంబునందుండి సర్వంబు సృజియించె
సత్యంబునందణిగె సర్వసృష్టి
సత్యమహిమలేని స్థలమేది కనుగొన్న
శుద్ధ సత్యమిది చూడరయ్యా"

అదియే దైవము. దీనినే Truth is God, Love is God, Live in Love అన్నారు. ఈ రెండింటి ద్వారానే మనం జీవించాలి. ఈ రెండే మనకు తలపాదములు. సత్య ధర్మములులేని మానవుడు అంధుడైపోతాడు. సత్య ధర్మములే మన నేత్రములు. ఈ నేత్రముల నుండి వచ్చే సృష్టియే శాశ్వతము. నేత్రములే లేకపోతే సృష్టియేలేదు. నేత్రమే లేకపోతే శాస్త్రమే లేదు. సర్వవేదములు, సర్వశాస్త్రములు, సర్వఉపనిషత్తులు, మానవుని ప్రేమ నుండియే ఆవిర్భవించినాయి. కూటి పేదనుండి కోటీశ్వరుని వరకు వున్న ఆస్తి ఒక్క ప్రేమయే. నీ తల్లి నీకు ఎంత ప్రేమయో, బీదవాని తల్లి అతనికి అంత ప్రేమ. ఎవరి ప్రేమ వారికి సంబంధించి నటువంటిదే. కాని అందరి ప్రేమ దైవానికి సంబంధించినది. భగవంతుడు ప్రేమ స్వరూపుడు. అందరియందు ప్రేమస్వరూపుడై ఉన్నాడు. కనుక మన జీవితాన్ని ప్రేమ చేతనే గమ్యం చేర్చాలి.

ఈ ప్రేమతత్త్వానికి వేదము 'ఆత్మ' అని పేరు పెట్టింది. ఈ ఆత్మకే ప్రేమ అని, ఈ ఆత్మకే బ్రహ్మఅని, ఈ ఆత్మకే సత్యమని, ఆత్మకే ధర్మమని - ఈ ప్రేమకు ఇవన్నీ ఆత్మ యొక్క పరిణామ పదములు. ఈ ఆత్మ మానవుని యందు సంచరించేటప్పుడు 'ఆత్మవాన్' అన్నది వేదము. 'ఆత్మవాన్' అనగా ఏమిటి? విష్ణువు యొక్క నాభికమలముల నుండి ఆవిర్భవించినటువంటివాడు బ్రహ్మ. ఆ బ్రహ్మకే 'ఆత్మ' అని పేరు. కాబట్టి బ్రహ్మను 'ఆత్మవాన్' అన్నారు. అతనినే 'అహం' అన్నారు. ఈ 'అహం' అనేటటువంటిది సర్వులయందూ ఉంటుండాలి. ప్రతి మానవునియందూ నిరంతరం సంచరించేటటువంటి ఆ బ్రహ్మతత్త్వము ఒక్కటే. కనుక సర్వులయందూ వున్నటువంటిది 'బ్రహ్మ' ఒక్కటే. ఆ బ్రహ్మతత్త్వము నుండి ఆవిర్భవించేటటువంటి శ్వాసము కూడనూ 'సో஽హం... సో஽హం...' 'నేనే బ్రహ్మ' అని అంటుంది. ఆ శ్వాసనాభికమలము నుండి ఆవిర్భవిస్తున్నది. ఇది ఒక్క దినమునకు 21,600 పర్యాయములు 'నేనే దైవము... నేనే దైవము....' అని ఉచ్చరిస్తున్నది. దానిని మనం మరచి పోతున్నాము. పుస్తకాలు కొనుక్కొని చదువుతున్నాము. శాస్త్రములు, వేదాలు పఠిస్తున్నాము. ఇవన్నీ చదివి ప్రయోజనం ఏమిటి? నీ అంతర్వాణిని నీవు అనుసరించ కుండా, బహిర్ముఖమైనవాటిని చదివితే వచ్చిన ఫలిత మేమిటి? కనుక మొట్టమొదట నీ 'అంతర్వాణి'ని నీవు అనుసరించు. అదియే నీ ప్రధానమైన గురువు. అదియే బ్రహ్మ, అదియే దైవము. బ్రహ్మ నిరంతరమూ మార్పు చెందనటువంటివాడు. కనుక అట్టి బ్రహ్మకు 'అమోఘం' అని వేదము పేరు పెట్టింది. మోఘమనగా శాశ్వతము

కానిది. అమోఘమనగా నిరంతరం ఉండినటువంటిది. కాబట్టి దైవత్వం నిరంతరమూ ఉండినటువంటిది. ఆ దైవత్వమును అందించేటటువంటి ప్రతి శ్వాసకూడనూ నిరంతరమూ ఉండేటటువంటిది. ఒక దేహము పోయినా, మరో దేహం రూపంలో శ్వాసరూపంలో వస్తున్నాడు. అతడు వర్ణనాతీతుడు కాబట్టి అతనిని **'అమోఘుడు'** అన్నారు. అమోఘమైన ఆనందాన్ని పొందామంటారు కొందరు. అనగా అంత్యములేని ఆనందాన్ని అనుభవించటం.

అందరి భక్తుల అభీష్టమును నెరవేర్చేవాడు గనుకనే అతనికి **'సిద్ధః'** అని మరొక పేరు పెట్టారు. 'సిద్ధః' అంటే మీ మనోభీష్టాలను నెరవేర్చడానికి నేను సిద్ధంగా ఉన్నానని చెప్పేవాడే భగవంతుడు. మన ప్రార్థనలు సరిగా లేకపోవటం వలననే, తాను సిద్ధంగా వుండికూడా, తిరిగి విముఖుడై పోతున్నాడు. కనుక పరిపూర్ణ భక్తితో భగవంతుని ప్రార్థించి నప్పుడు, అన్నింటియందూ సిద్ధంగా నిలుస్తాడు. నీ కోరికలన్నీ తీరుస్తాడు.

'ఆత్మవాన్' అనేటటువంటిది ఈశ్వరుని యొక్క తత్త్వము. కనుకనే 'ఈశావాస్యమిదం జగత్, ఈశ్వరస్సర్వ భూతానాం' అన్ని భూతములయందూ ఉంటున్నాడు. సర్వత్రా ఉంటున్నాడు. అతనికి కావల్సింది ఏదీ లేదు. అతనికి అభీష్టమే లేదు. అతనికి కోరికలే లేవు. ఏ కోరిక కోరినా భక్తుల నిమిత్తమై కోరేటటువంటివే. ఏది సంకల్పించినా భక్తుల నిమిత్తమై సంకల్పించేటటువంటివే. కనుక మనయందు సత్సంకల్పాలు అభివృద్ధి పరుచుకోవాలి.

మానవుడనగా ఎవరు? మనసుగలవాడు మానవుడు. మనసు అంటే ఏమిటి? సంకల్పములచేరిక, ఈ సంకల్పములు ఎట్లా ఉండాలి? సత్సంకల్పాలుగా ఉన్నప్పుడే వీడు సరియైన మానవుడు అవుతాడు. సత్య సంకల్పాలను విస్మరించినవాడు మానవుడే కాదు. బీదలకు, ధనవంతులకూ, సర్వులకూ భగవంతుడు సమానం. సర్వమానవులకు సమానమైన ఆస్తి భగవంతుడు ఒక్కడే. సమానమైన స్నేహితుడు భగవంతుడు ఒక్కడే. సమానమైన శక్తిపరుడు భగవంతుడు ఒక్కడే. అందరికీ హక్కు ఉన్నది. అందరూ ఈ ఆస్తిని అనుభవించవచ్చును. అయితే పవిత్రమైన హృదయాన్ని అభివృద్ధి పరుచుకోవాలి. అనగా కరుణదయలతో నింపుకోవాలి. 'దయ' అంటే Compassion అయితే ఆ 'కంపాషన్' తో హృదయం నిండాలి. అయితే ఈనాడు ఆ 'కంపాషన్' లేదు. అది **'ఫాషన్'**గా మారిపోయింది. నిజంగా ఈ కంపాషననే గనుక వుండి వుంటే, జగత్తులో యిన్ని అల్లకల్లోలములు ఎందుకు జరుగుతుంటాయి?

**ప్రేమస్వరూపులారా !**

ఈశ్వర చంద్ర విద్యాసాగర్ కలకత్తా సమీపంలోని చిన్న గ్రామంలో ఉండేవాడు. అతను చాలా బీదవాడు. అతని చేతిలో నయాపైసా కూడా ఉండేదికాదు. వీధి దీపాల క్రింద కూర్చొని చదువుకొనేవాడు. శ్రద్ధగా చదివి కట్టకడపటికి 'లా' ప్యాసయినాడు. మంచి వాగ్ధాటి గలవాడు. అతనికి ఏ ఉద్యోగం చిక్కలేదు. ఇల్లు గడవటం చాలా కష్టంగా ఉండేది. తల్లి వృద్ధురాలు. గంజికాచేది. తల్లి, కుమారుడు ఇద్దరూ త్రాగి కాలక్షేపం చేసేవారు. కొంతకాలం తరువాత ఉద్యోగం చిక్కింది. జీతం తీసుకొని వచ్చి తల్లికి యిచ్చి 'అమ్మా నీకు ఏమి కావాలమ్మా! నీ అభీష్టమేమిటి?" అని వినయంగా అడుగుతాడు. అప్పుడు అతని తల్లి "నాయనా! నేను ఇప్పుడు చెప్పను. అడగను. అడిగే సమయం వస్తుంది. అప్పుడు చెబుతాను" అంటుంది. కొంత కాలానికి ప్రమోషన్ వస్తుంది. జీతం పెరుగుతుంది. తమ అవసరాలకుపోను ప్రతి నెలా యింకా మిగులుతుంటుంది. అప్పుడు తల్లి దగ్గరకు వెళ్ళి అడుగుతాడు. "అమ్మా! ఇప్పుడు చెప్పమ్మా! నా దగ్గర ధనం అధికంగా ఉన్నది. దీనిని ఏ విధంగా ఖర్చుపెట్టాలో చెప్పమ్మా" అని వినయంగా అడుగుతాడు. అప్పుడు ఆమె చెబుతుంది. "నాకు మూడు నగలు కావాలి. అవి ఏమిటంటే - మన గ్రామంలో చాలామంది పిల్లలు ఉన్నారు.

"శ్రీకారితా ఓంకారా
సాకారా సత్యసాయి శాంతాకారా
లోకారాధ్యా గురుశ్రీ
లోకోత్తమ గొల్తునేను శుభముకై"

"అరుణోదయ శుభకాంతీ
కరుణా సిరిప్రసరనదన కళ్యాణ నిధీ
చిరునగముల(వాక్కుల(శ్రీ
ధరనేవెడని దివ్యమూర్తి దండము సాయీ!"

- **తాటికొండ తిరుపతయ్య**, నర్సపట్నం

చదువుకోవటానికి చిన్న స్కూలు కూడా లేదు. చాలా దూరం వెళ్ళి చదువుకుంటున్నారు. కనుక మన గ్రామంలో ఒక చిన్న స్కూలు కట్టించు. అదే నా మొదటి నగ" అంటుంది. సరేనని స్కూలు కట్టిస్తాడు విద్యాసాగర్.

కొంతకాలం అయిన తరువాత నాకు రెండవ నగ కూడా కావాలంటుంది ఆ తల్లి. చెప్పమ్మా! అంటాడు విద్యాసాగర్. "పిల్లలకు జబ్బు చేస్తే మన గ్రామంలో కొంచెం మందిచ్చేవారు కూడా లేక ఎంతోమంది బాధపడుతున్నారు. కనుక మన గ్రామంలో ఒక చిన్న ఆసుపత్రి కట్టించు నాయనా! ఇదే నా రెండవ నగ" అంటుంది. సరేనని ఆసుపత్రి కూడా కట్టిస్తాడు విద్యాసాగర్. మరికొంత కాలం అయిన తరువాత కుమారుని పిలిచి "మన గ్రామంలో త్రాగడానికి నీరు దొరకక చాలామంది బాధపడుతున్నారు. బావులలో నీరు ఇంకిపోయింది. కనుక నీటికొరతను తీర్చడానికి ఏదైనా ఏర్పాటు చేస్తే బాగుంటుంది. ఇది నా మూడవ నగ" అంటుంది. ఆ నీటి సౌకర్యం కూడా చేస్తాడు విద్యాసాగర్. ఆ తల్లి ఆనందంతో "నాయనా! నీలాంటి కుమారుడు ఒక్కడుంటే చాలు. ఇలాంటి కొడుకులు అందరికీ ఉంటే బాగుంటుంది' అని సంతోషమును వెలిబుచ్చుతుంది.

ఈనాడు భారతదేశంలో కోటీశ్వరులకు కొరతలేదు. విద్యావంతులకు కొరతలేదు. పండితులకు కొరతలేదు. వైజ్ఞానులకు కొరతలేదు. కావలసినంతమంది ఉన్నారు. కానీ వీరి మధ్య ఐకమత్యంలేదు. ఒకరిని చూస్తే మరొకరికి అసూయ. ఈ దుర్గుణములు మానవుని యందు పెరుగుతూ వస్తున్నాయి. ఎంతమంది ఉండి ఏమి ప్రయోజనం? గుణములేని బలము నిరుపయోగం, గుణములేని ధనం నిష్ప్రయోజనం. కాబట్టి ప్రతివానిలో 'త్యాగగుణం' కావాలి. త్యాగం కంటే అమృతతత్త్వము ఎక్కడ ఉన్నది? దురాశతో దుర్గతిని పొందుతున్నారు. సంపాదించిన సొమ్మునంతా విదేశాలలో దాచి కన్ను మూస్తున్నారు. స్వదేశాభివృద్ధికి ఏ మాత్రం ముందుకు రావటం లేదు. ఈనాడు మానవుని యందు సద్భావములు పూర్తిగా శూన్యమై పోతున్నాయి. మాటలు చెబుతారు ఎన్నో! చేతలయందు శూన్యం. **"చెప్పవచ్చు కోటి ! చేయరు ఒక్కటి"** చేయనప్పుడు చెప్పుట ఎందుకు? వేదికలమీద చాలా త్యాగాలు పలుకుతారు. ఆ పలుకులు ఎంతవరకు? వేదిక దిగేంతవరకే. తరువాత ఆ మాటలు ఎక్కడికి పోతాయో! తానెక్కడకు పోతాడో! కనుక ఈనాటి మానవుని యొక్క పలుకులు పూర్తి ఆడంబరంగా ఉంటున్నది. కేవలం ప్రచారంగా ఉంటున్నది. స్టేజీపైన **'హీరో'**. స్టేజీ దిగితే **'జీరో'**. ఇలాంటివారు ఏదో ఒక రోజున 'జీరో'లు అయిపోతారు.

ధనమును త్యాగం చేయాలి. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఆ విధంగా చేశాడు. మహనీయులు ఈ విధంగా అనేక ఆదర్శములను అందించి వెళ్ళారు. వారి అడుగుజాడలలో మనం నడవాలి.

ఈనాడు 'ఈశ్వరమ్మడే!' ఈశ్వరమ్మ అంటే ఎవరు? ఎవరికీ తెలియదు. ఏదో ఆమె పేరు ఈశ్వరమ్మ. ఈశ్వరునికి అమ్మ ఈశ్వరమ్మ. ఆమె పేరు తల్లిదండ్రులు పెట్టిందికాదు. కొండమరాజు వివాహ సమయంలో చెప్పాడు. "నీకు ఈ పేరు సరిగా లేదు. ఈశ్వరమ్మ నీకు సరియైనటువంటి పేరు" అని ఆమెను 'ఈశ్వరమ్మ' అని పిలిచాడు. ఎందుకంటే ఈమె ఈశ్వరునికి అమ్మ


**భగవాన్ శ్రీ సత్యసాయి నిత్యాన్నదాన పథకము**

కృష్ణాజిల్లా వేదాద్రిలో నిత్యాన్నదానము ది. 29-4-1999 నుండి భగవాన్ సాయి భక్తులు నిర్వహిస్తున్నారు. అన్నదానము నిత్యమూ ఉదయం గం॥11-00ల నుండి మధ్యాహ్నం గం॥2-00ల వరకు, రాత్రి గం॥ 7-00ల నుండి గం॥9-00ల వరకు అక్కడకు వచ్చే భక్తులకు అన్నదానం చేయబడుతున్నది. ఈ కార్యక్రమమునకు ఒకవ్యక్తి ఒకసారి రు. 1116/-లు చెల్లించుతే, ఆ మొత్తమును **'ఫిక్సెడ్ డిపాజిట్'** చేసి, దాని మీద వచ్చే వడ్డీతో, వారు కోరిన రోజున 10 మందికి **'అన్నదానం'** చేయబడుతుంది. సహకరించి, ప్రోత్సహించ ప్రార్థన.

**వివరములకు :**

**శ్రీ సత్యసాయి నిత్యదాన అన్నపూర్ణ నిలయం**
**వేదాద్రి - 521 175.**
**(వయా) జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా**

కాబోతున్నది ఆమె చాలా బీదకుటుంబంలో ఉన్నది. ఏనాడు చేతిలో నయాపైసా ఉండేదికాదు. ఆమె సరీగా అన్నం తినే ఎరుగదు. నిత్యమూ సంకటే.. సంకటే... అదే రాగి సంకటి. నాకు కూడా అదే రుచి. కుర్మాలు, బర్మాలు నాకు నచ్చవు. సంకటి తీసుకుంటూ, శనక్కాయ పచ్చడి నంచుకోవటం నాకు చాలా ఇష్టం. నా తిండి కూడా అంతే. ఈశ్వరమ్మ ఒక్క అక్షరం కూడా నేర్చుకోలేదు. ఏ చదువూ తెలియదు. ఆ తెలియకపోవటం చాలామంచిదని నేను ఇప్పుడు అనుకుంటున్నాను. ఈ చదువులు చదివినటువంటివారిని, ఈనాడు పట్టటానికి వీలులేదు. వారి నడకలు, ఫాషన్లు చూస్తుంటే, చాలా విపరీతంగా ఉంటున్నాయి. ఈమె మాత్రం చదువలేదు. ఛాలా గొప్పపని చేసిందనుకున్నాను. నేను చిన్నవానిగా ఉన్నప్పుడు, పిల్లలందరికి పండరి భజన నేర్పిస్తుండేది. అప్పుడు ఈ దేహమునకు 7 1/2 సంవత్సరములు. అప్పుడు పండరి భజన చేస్తూ, పాటలు పాడుతూ అడుగులు వేస్తుంటే, సుబ్బమ్మ, ఈమె ఒకే ఆనందపడుతుండేవారు. వెంకమరాజు ఖర్చులకోసం ఏదో ఇచ్చివుంటాడు. రెండు అణాలు ఆమె వద్ద మిగిలింది. దానిని ఎప్పటి నుంచో దాచిపెట్టుకొని వుంటుంది. ఆ రెండు అణాలకు రెండు మూటలు బొరుగులు (పాప్‌డ్‌రైస్) వచ్చాయి. వాటినంతా పిల్లలకు పంచి పెట్టింది. ఎవరినైనా ప్రేమతో పలుకరించేది. భక్తులు వచ్చి అమ్మా! మమ్ము స్వామి చూడలేదంటే, ఇది మీ మంచి కోసమేనని చెప్పి ఎంతో బోధ చేసేది. తరువాత నన్ను చదువుకోసం ఉరవకొండ తీసుకొని వెళ్ళారు. పుట్టపర్తిలో వుండగా పిల్లలందరికీ రాత్రిపూట చదువు చెప్పేవాడిని. నేను ఉరవకొండ వెళ్ళుతుంటే, ఆ పిల్లలందరూ వచ్చి "రాజు! మీరు పోతున్నారే! మీకు గురుదక్షిణ ఏ విధంగా యివ్వాలి?" అని చాలా బాధపడ్డారు. ఒక్కొక్కరు ఒక బొట్టు (మూడుపైసలు) తీసుకొని వచ్చారు. ఆ విధంగా పదిమంది యివ్వగా 2 1/2 అణాలు అయినాయి. అవి తీసుకొనివెళ్ళి ఈశ్వరమ్మకు యివ్వగా నా చేయి పట్టుకొని ఏడుస్తూ "ఈ చిన్నవాడికి ఇంత త్యాగమా! పిల్లలు యిచ్చింది కూడా దాచుకోకుండా, నాకు యిస్తున్నావే!" అని ఏడ్చింది. ఆ డబ్బులను పోయేంతవరకు మూటకట్టి దాచుకుంది. తరువాత మందిరం కట్టాం. ఒకసారి పైకి నా దగ్గరకు వచ్చింది. ఎవరెవరో వస్తుంటే, మీరు రాకండని చెప్పింది. నేను టేబుల్‌పైన భోజనం చేస్తుంటే వచ్చి నా రెండు చేతులూ పట్టుకుంది. "మన గ్రామంలో ఆసుపత్రి లేదు. ఏదైనా చిన్నది కట్టించండి! చాలామంది బిడ్డలను ఎత్తుకొని వైద్యం కోసం బుక్కపట్టణం వెళుతున్నారు. వారు పడుతున్న కష్టాలను చూడలేక పోతున్నాను. నా బిడ్డలు నాకు ఎట్లాగునో, వారి బిడ్డలు, వారికి అట్లే గదా! కాబట్టి ఒక చిన్న ఆసుపత్రి కట్టించండి!'అన్నది. కట్టిస్తానని చెప్పాను. కట్టించాను. ఆనాడు ఆమె పొందిన ఆనందానికి అంతేలేదు. కొంతకాలం అయిన తరువాత మరల నా దగ్గరకు వచ్చి "పిల్లలు చదువు కోవటానికి స్కూల్ లేక నడచి ఎంతో దూరం వెళ్ళి చదువు కొని వస్తున్నారు. చిన్నచిన్న పిల్లలు ఎంతో కష్టపడు తున్నారు. కనుక ఒక చిన్న స్కూల్‌ను కట్టించండి!" అన్నది. కట్టిస్తానని చెప్పాను. కట్టించాను. 'ఇంకా ఏమి కావాలి?'అని అడిగాను. అప్పుడు ఆమె "మన ఊళ్ళో త్రాగడానికి నీరులేక ప్రజలు ఎంతో యిబ్బందులు పడుతున్నారు. నీటి సౌకర్యం కూడా కల్పించండి" అని కోరింది. ఒక పెద్ద బావిని త్రవ్వించాను. మంచి జల పడింది. అందరూ సంతోషించారు.

## శాంతిధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి!

"వాల్మీకి తొల్లటి వర్తనం బదియేడ
రామాయణంబును వ్రాయుటేడ
యరయకుచేలుని యార్థికస్థితి యేడ
శ్రీ కృష్ణసాంగత్య సిద్ధియేడ
పరికింప శబరికిఁబాండిత్యమదియేడ
శ్రీరామసన్నిధిఁజేరుటేడ
ప్రహ్లాద భక్తుని ప్రాయమెంచఁగ నేడ
నరసింహు కరుణాబ్ధి పారయుటేడ
మత్త గజేంద్రుని చిత్తగమనమేడ
విష్ణు సాక్షాత్కార విభవమేడ
మహిని పాండిత్య సాహిత్యమహిత ధనము
లెన్నప్రాయంబు లేవియు నున్నదగవు
పరమ పదమును జేరంగ భక్తి వలయు
శాంతిధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి!

- కొలచన వెంకటరమణమూర్తి

క్రమక్రమేణా మీ అందరికీ తెలుసు. మూడు వందలకోట్ల రూపాయిలదాకా ఖర్చుచేసి అనంతపూర్ జిల్లా వాసులందరికీ మంచినీటిని అందించాను. మరి మూడు వందల కోట్లదాకా ఖర్చుచేసి సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌ను నిర్మించాను. అంతేకాదు చదువుకోవటానికి ఒక విశ్వవిద్యాలయాన్నే నిర్మించాను. **తలకు చదువు, హృదయానికి వైద్యం, దేహానికి జలము - ఈ మూడు నేను ఉచితంగా అందించాను.** Free Education, Free Health, Free Water - ఈ మూడు నేను Free గా అందిస్తున్నాను. ఈనాడు భారతదేశంలో చదువును అమ్ముకుంటున్నారు, డాక్టర్లు వైద్యాన్ని అమ్ముకుంటున్నారు. త్రాగడానికి నీరునయినా అందించలేకపోతున్నది ప్రభుత్వం. వారికి డబ్బు కావాల్సిందే. కాని కొంతమితంగా వ్యవహరించాలి. మానవతా దృష్టితో పోవాలి. కాని హీనంగా దిగజారిపోతున్నారు.

భారతదేశం ఎంత పుణ్యభూమి, ఎంత త్యాగభూమి, ఎంత యోగ భూమి - ఇలాంటి యోగభూమిని భోగభూమి గా మార్చడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది మంచిది కాదు. మన చేతిలోవున్నదానిలో సగమైనా ఎదుటివారికి ఇవ్వండి. పట్టెడన్నం పెడితే పొట్టనిండుతుంది. ఒక్క గ్లాసెడు నీరు యిస్తే చాలు. ఎక్కడి నుంచో గంగా జలం తీసుకొని రానవసరం లేదు. కాని ఈనాడు దురాశలు పెరిగి పోతున్నాయి. కట్టకడపటికి దుష్టాశలుగా మారిపోతున్నాయి. వీరికి దుర్యోధనదుశ్శాసనులకు పట్టిన గతే పడుతుంది. దుర్బుద్ధులు ప్రవేశించ కూడదు. దురాలోచనలు రాకూడదు. దుర్భావనలు పెరుగకూడదు. ప్రేమతత్వంతో జీవించండి! ఇవి ఏమీ చేయకపోతే, ప్రేమతో ఒక మాటైనా మాట్లాడు.

**పిల్లల్లారా!**

మీరు చాలా చిన్నవారు. ఈనాటి నుంచే మీ భవిష్యత్తును చక్కగా తీర్చిదిద్దుకోండి! మీతోటి స్నేహితులతో ప్రేమగా మాట్లాడండి. మీవద్ద రెండు పెన్సిల్సు వుంటే, లేనివాడికి ఒక పెన్సిల్‌ను యివ్వండి. త్యాగానికి సిద్ధంకాండి. మీరందరూ ప్రేమను పెంచుకోండి. ప్రేమకు మించిన ధనం లేదు. ప్రేమగనుక మనలోవుంటే, తప్పక శ్రీమంతులమైపోతాం. ఐశ్వర్యవంతులమైపోతాం. అధికారులమైపోతాం. అన్నింటికినీ ప్రేమయే ప్రధానం. మంచి బుద్ధులను పెంచుకొని, తల్లిదండ్రులను గౌరవించండి. **'తల్లికి మించిన దైవం వేరే ధరణిలో లేదండి!'** కనుక తల్లిని గౌరవించండి. దుష్టుడైన కొడుకైనా లోకంలో వున్నాడుగాని, దుష్టురాలైన తల్లి లోకంలో లేదు. కనుక తల్లిని ప్రేమించండి. ఈ విధంగా చేసినప్పుడు మీ భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుంది.

**'యద్భావం తద్భవతి'** మనం ఈనాడు మన తల్లిదండ్రులను మనం గౌరవిస్తే, భవిష్యత్తులో మన పిల్లలు మనల్ని గౌరవిస్తారు. ఈ యదార్థమును విస్మరించకండి. మనం చదువుతోపాటు సంస్కారమును పెంచుకోవాలి. భారతీయ సంస్కృతి చాలా గొప్పది. దానికి తగిన గౌరవం యివ్వండి. వినయంగా, ప్రేమతో మంచిగా మాట్లాడండి. ఇంటికి వచ్చిన అతిథులను మంచిగా గౌరవించండి. **నోటు బుక్కులు కాదు ముఖ్యం, నోటి బుక్కులు ముఖ్యం. నోటి నుంచి మంచి మాటలు రానివ్వండి.** ప్రేమతో జీవించండి. అప్పుడే మీయందు భగంతుడు ఆవిర్భవిస్తాడు.

(ది. 6-5-2000న బృందావన్ (బెంగుళూరు)లో 'ఈశ్వరమ్మ-డే' సందర్భమున భగవాన్ సాయి చేసిన ప్రసంగం నుండి) ■

"మతము చింతన వద్దు మానవత్వమె హద్దు
సాయిరాముని చెంత జనులకిపుడు
నామజపమె చాలు ప్రేమ భావమె మేలు
సాయి భక్తులకెంతో సాయమగును
సత్యశాంతి సుగతి నిత్య ధర్మ ప్రగతి
ఆత్మసౌందర్య మహత్తరగతి
కన్నీరు తొలగించి పన్నీరు వెలయరాదు
సన్నిధి సాయీశు పెన్నిధియని
జగతి నాల్గు దిసలవారు చాటినారు
ఆత్మ చింతనానంద మహత్వమిమ్ము
దివ్యశాంతి నిలయవాస! ధీ వికాస
సత్యసాయీశ జగదీశ సన్నుతింతు"

*- పంచాంగము శీనప్పశాస్త్రి, పుట్టపర్తి*

# బృందావనం

# స్వామి సన్నిధిలో - నా స్వగతాలు



మేము బృందావనం చేరుకునేసరికి శ్రీలంక, థాయ్‌ల్యాండ్, ఇండోనేషియా మొదలగు దేశాలవారు అందరూ వచ్చేశారు. ఇక బృందావనమంతా సందడే సందడి. ఆనాటి బృందావనంలో శ్రీ కృష్ణుని సన్నిధిలో గో, గోప, గోపికలు ఎంత ఆనందంతో ఉన్నారో! శ్రీ కృష్ణుని పసిడిపలుకులకు ఎంత మురిసిపోయినారో, ఆ బాలకృష్ణుని ఆటపాటలతో ఎంతమంది మైమరచారో మనము చూడలేదు. కానీ ఈనాటి బృందావనంలో శ్రీ సాయి కృష్ణుని సన్నిధిలో జరిగే వేడుకలు మరపురానివి. మరువ లేనివి. రమేష్ హాలంతా రకరకాల అలంకారాలతో మెరిసిపోతున్నది. అందరూ వస్తే నేను రానా! అన్నట్లు చల్లని పిల్లగాలులు వీచి వారు అందముగా అలంకరించిన కాగితపు పూలబుట్టలు, రంగు రంగుల తోరణాలు మెల్ల మెల్లగా కదులుతూ చూపరులకు ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. ముచ్చటయిన ఆ మూడు రోజులూ భజన కూడా వారే చేశారు. భాష ఏదైనా భావం ఒక్కటే. భక్తి భావంతో ఆలపించిన పాట భగవంతుణ్ణి, భక్తులను కూడా పరవశింప జేస్తుంది. ఉదయం భజన, హారతి, కాలేజీలో క్లాసులు. స్వామికి క్షణం తీరిక లేదు. ఆనాడు వామనుడు బలిని మూడడుగులు మాత్రమే కోరి మూడు లోకములు ఆక్రమించాడని చదువుకున్నాము. మరి అవి పెద్ద పాదములో! బ్రహ్మాండమంతా వ్యాపించి యున్న ఆ పాదములను జీవులను సృష్టించు బ్రహ్మదేవుడు కడిగినాడని పాడుకుంటున్నాము. మరి ఆపాదములు ఎంత పవిత్ర మైనవో. కల్మషపూరితమైన ఈ కలియుగములో అటువంటి అవకాశము మనకు దొరకదు. కానీ ఎన్ని జన్మల పుణ్య ఫలమో భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయీశ్వరుని సన్నిధి మనకు దొరకటం. ఆనాడు భక్తితో బ్రహ్మకడిగిన పాదము, వినయముతో వంగిన బలితలమోపిన పాదము. ప్రేమతో లక్ష్మీదేవి పిసికిన పాదము, ఈనాడు మనం ఎక్కడికీ వెళ్ళకుండా మనను ఉద్ధరించడానికి మనముందే తిరుగాడు తున్నాయి.

చూడడానికి కోమలమైన, సుకుమారమైన, సుతి మెత్తని చిన్ని చిన్ని పాదములు అవి. కానీ వీటి యొక్క శక్తి అమోఘము. అద్భుతము. ఆ పాదములను స్పర్శించిన వారి జన్మ సాఫల్యము. స్వామి చిరునవ్వులు చిందిస్తూ ఆ చిన్ని చిన్ని పాదములతో మనమధ్య తిరుగాడుతూ ఉంటే మనము మైమరచిపోతాము. ప్రేమతో పలుకరించగానే పులకరించిపోతాము. అనుకున్నది అడగలేము. నోటివెంట మాటరాదు. ఆ స్వామి చల్లనిచూపులో, మధురమైన మాటలో, మెత్తని స్పర్శలో అంతటి శక్తి ఉన్నది. ఎన్ని వేలమంది వచ్చినా పుష్పక విమానంలాగా ఇంకా చోటు ఉంటుంది స్వామి సన్నిధిలో. కొట్టుకోకుండా నెట్టుకోకుండా గువ్వల్లాగా ఒదిగి ఒదిగి కూచుంటారు ప్రతివారు. చిరు నవ్వుతో సాయిరాం చెబుతుంటారు అందరూ.

**కొమరగిరి జయప్రద**

ఇక స్వామి సంగతి సరేసరి. సాయంకాలం కొంతసేపు పిల్లలు వారి అనుభవాలు వచ్చిన హాలులో కొంతమంది పెద్దలు మాట్లాడిన తరువాత స్వామి పలికిన పసిడి పలుకులు. ఎంత శ్రమపడుతున్నావు స్వామీ! చెప్పీ! చెప్పీ! మా కోసం ఎంత కష్టపడుతున్నావు స్వామీ! తమరి యొక్క సంబోధన పిల్లలకేగాని ఇక్కడికి వచ్చినవారు ఎంత గొప్పవారైనా ఎంత పెద్దవారైనా అందరూ తమ ముందు విద్యార్థులే కదా! గంటసేపు అలా నిలబడితే నీ కాళ్ళు ఎంత నొప్పిపుడుతున్నాయో అనిపించింది నాకు. తమరు తీసుకునే ఆహారము కొంచెము. తమరుచేసే వ్యవహారం ఎక్కువ. ఎందుకు స్వామీ! మూర్ఖులమైన మామీద యంత దయ. తమరు చెప్పినవన్నీ వింటూ ఇక్కడ తల ఊపటం, ఎవరిళ్ళకు వారు వెళ్ళగానే పాత అలవాట్లు, పాత వాసనలే. ఇది ఎప్పటికి మారేను? తమ దర్శనం కోసం కొంతకాలము నిలువలేని మాలాంటి స్వార్థపరుల కోసం, ఎన్నో గంటల కాలాన్ని నిస్వార్థంగా మా కోసం వెచ్చిస్తున్నావు స్వామీ. నీకు ఏవిధంగా కృతజ్ఞతను తెల్పుకోగలము. కాస్త విశ్రాంతి

తీసుకో స్వామీ! సార్ధక నామధేయుడు "కరుణశ్రీ" వ్రాసినట్లు.

"పుట్టబోయెడు బుల్లి బుజ్జాయి కోసమై
పాదుగు గిన్నెకు పాలు పోసి పోసి
చలువ వెన్నెలలూరు చలువ దోసిళ్ళతో
లతలకు మారాకు లతికి లతికి
పూలకంచాలలో రోలంబములకు
రేపటి భోజనము సిద్ధపరచి పరచి
తెల్లవారకుండ మొగ్గలోన జొరబడి
వింత వింతల రంగులు వేసి వేసి
తీరికే లేని విశ్వ సంసారమందు
అలసి పోయితివేమో దేవాదిదేవా
ఒక నిమేషము కన్ను మూయుదువు గాని
రమ్ము తెరచితి మా కుటీరమ్ము తలుపు!!"

ఎంతో అలసిపోయిన నీవు మా హృదయాలలో ప్రవేశించి కాసింత విశ్రాంతి తీసుకొనవయ్యా! స్వామీ!

## భగవాన్ సాయి జన్మదిన ప్రత్యేక సంచిక

భగవాన్ సాయి 75వ జన్మదిన ప్రత్యేక సంచిక నవంబరులో వెలువడుతుంది. ప్రముఖుల వ్యాసము లతో, భక్తుల అనుభూతులతో, భగవాన్ సాయి దివ్యోప దేశములతో, మహిమలతో, మల్టీకలర్ కవరు పేజీతో (స్వామి ఫోటోతో) సర్వాగ సుందరంగా రూపొందించ బడుతుంది. త్వరపడండి! ప్రత్యేక సంచికను స్వంతం **చేసుకోండి! వెల రు. 15/-లు మాత్రమే.** సెప్టెంబరు లోపు చందా కట్టినవారికి మాత్రం రు. 5/-లకే పంప బడుతుంది. అదనంగా చెల్లించ నవసరంలేదు. పాత చందాదారులకు ఈ ప్రత్యేక సంచిక పంపబడుతుంది. వారు ప్రత్యేకంగా, అదనంగా డబ్బు పంపనవసరంలేదు. రెన్యూల్ చేయవలసిన వారు వెంటనే రెన్యూల్ చేయండి. క్రొత్త చందాలు చేర్పించి ఈ సదవకాశము వినియోగించుకోండి! రెన్యూల్ చేయనివారికి ఈ ప్రత్యేక సంచిక పంపబడదు. గమనించ ప్రార్థన.

**వ్యాసములు, భక్తుల అనుభూతులు, భగవాన్ సాయి మహిమలు పంపదలచినవారు ముద్రణతో రెండు పేజీలకు మించకుండా పంపవలెను.** - సం.

రావయ్యా! ఆ! ఆగు! స్వామీ! ఆగు! తమలాంటివారు కూర్చోటానికి మా దగ్గర సరియైన ఆసనం లేదు స్వామీ-

"కూర్చుండ మా యింట కురిచీలు లేవు
నా ప్రణయాంకమే సిద్ధపరచనుంటి
పాద్యమ్ము ఇడమాకు పన్నీరు లేదు
నా కన్నీళ్ళతో కాళ్ళుకడుగనుంటి
పూజకైమావీట పుష్పాలులేవు
నా ప్రేమాంజలులె సమర్పింపనుంటి
నైవేద్యమిడ మాకు నారికేళము లేదు
హృదయమే చేతికందీయనుంటి
లోటురానీయనున్నంత లోన నీకు
రమ్ము! దయచేయు! ఆత్మ పీఠమ్ము పైకి!!" అన్నారు

శ్రీ పాపయ్యశాస్త్రిగారు. అవును అదే తమకు సరియైన స్థానము. ఎందుకనగా నీవు ఆత్మారాముడవు! పరంధాముడవు గదా సాయిరామా! అందుకేనయ్యా నీకా స్థానం. అష్టైశ్వర్య సంపన్నుడవైన నీకు ఇవ్వటానికి విలువైనది మా వద్ద ఏమున్నది స్వామీ! నీకు ఏది ఇచ్చినా సూర్యుని ముందు దివిటీలాగా ఉంటుంది. నీ సేవకులము అని చెప్పటం కూడా అహంకారమే అవుతుంది. మానవాళికి తమరు అందిస్తున్న సహాయం ముందు మా చిన్ని చిన్ని పనులు హనుమంతుడి ముందు కుప్పిగంతులు వేసినట్లుగా ఉంటుంది. కానీ 'నవనీతచోరా' అన్న నామం నీకు ఉన్నది. మా నుండి నీవు ఆశించేది, నవనీతంలాంటి మనసు మాత్రమే. మెత్తని, చల్లని, స్వచ్ఛమైన వెన్నలాంటి మనసు కావాలి నీకు. పోనీ అది ఇద్దామనుకున్నా, విషయవాసనలనే ఎర్రని చీమలు పట్టిన ఎంగిలి వెన్నలాంటి మా మనసులను నీకు ఏ విధముగా సమర్పింపగలము? నాకు ఏమీ తోచటం లేదు స్వామీ. స్వామీ! ఒక విన్నపం. తమ దర్శనం బాగానే జరుగుతున్నది. నన్ను రోజూ బాగానే చూస్తున్నారు. అయితే స్పర్శన దర్శన సంభాషణలు కోరటం మానవ సహజం కదా? నీవు ఎవరి కోసమో వెళుతుంటే నీ పాదములను స్పృశించటంలో నాకు తృప్తిలేదు. తమరు ప్రత్యేకంగా నా కోసమే వచ్చి పాదనమస్కారం ఇవ్వాలను కున్నారు. ఆ రోజే ఫస్ట్‌లైన్ వచ్చింది. కానీ స్వామి సరాసరి పురుషులవైపు వెళ్ళారు. అయినా ఆశగదా? తిరిగి వెళ్ళేటప్పుడు ఇటు వస్తావుగదా స్వామీ! అని అనుకున్నాను. అలాగే స్వామి తిరిగి వెళ్ళేటప్పుడు నా వైపు చూస్తు

ప్రత్యేకంగా నా దగ్గరకు వచ్చి వారి పవిత్రమైన పాద స్పర్శన మహాభాగ్యమును నాకు కలుగజేశారు. రెండు చేతులతోనే కాదు నా తలను కూడా రెండు పాదాలపై పెట్టాను. స్వామి కదలల్లేదు. స్వామి ఏమి దీవించారో నాకు తెలియదు కానీ నా జన్మ ధన్యమైందని అనుకున్నాను నేను. అప్రయత్నంగా నా కనుల వెంట నీరు తిరిగింది. కనుల నీరు నిండెనోయి కాంచలేను నీ రూపము అనుకొని స్వామికి నమస్కరించాను. మేము ఇక్కడికి వచ్చిన మూడవరోజునే స్వామి శ్రీవారికి పాదనమస్కారం ఇచ్చి దీవించారు. ఈ ఇరవై రోజులు ఆనందముగా స్వామి సన్నిధిలో గడచి పోయినవి. ఒక్కక్షణం కూడా సమయాన్ని వృధాచేయక వేసవి తరగతులలో స్వామి ప్రసంగాలను శ్రీవాణిలో ప్రచురించటానికై నిర్విరామంగా వ్రాస్తూ ఉండేవారు మా శ్రీవారు.

తిరుగు ప్రయాణము (ది.8-6-2000)నకు రిజర్వేషను చేయించుకున్నాము. ది. 7-6-2000న స్వామితో మా శ్రీవారు స్వామీ! రేపు నేను వెళ్తున్నాను అనగా, స్వామి చిరునవ్వులు చిందిస్తూ నేనూ రేపు వెళ్తున్నాను అన్నారుట. స్వామికి తెలియనిదేమున్నది? ఈ ఇరవైరోజులూ జగన్నాటక సూత్రధారితో దర్శన, స్పర్శన, సంభాషణలు అయిపోయినవి. ఇక రేపటి నుంచి మా జీవన నాటకంలో మా పాత్రలను పోషించటానికి సిద్ధమవుతూ స్వామికి నమస్కరించి, స్వామీ! లోకంలో చెడ్డపిల్లలు ఉంటారుగాని చెడ్డ తల్లిఉండదని తమరే సెలవిచ్చారుగదా? అందువలన మాలోని దుర్గుణములను తొలగించి తప్పులను మన్నించి మాకు తల్లి, తండ్రి, గురువు, దైవము సర్వము తమరే అయి సర్వదా సర్వకాలేషు సర్వత్రా మా యింట వెంట జంట ఉండి మమ్మల్నందరిని కాపాడమని కోరుకుంటూ స్వామి సన్నిధిని విడువలేక విడువలేక బందరు ప్రయాణమైనాము. ●









- శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

*బ్రాహ్మణో౽స్య ముఖమాసీత్*
*బాహూ రాజన్యః కృతః ।*
*ఊరూ తదస్య యద్వైశ్యః*
*పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥*

అర్ధం :

| | | |
|---|---|---|
| అస్య | - | ఆ పురుషునకు |
| బ్రాహ్మణః | - | బ్రహ్మజ్ఞానంగల బ్రాహ్మణవర్గం |
| ముఖం ఆసీత్ | - | ముఖమై ఉండెను |
| రాజన్యః | - | క్షత్రియ వర్ణం |
| బాహూ కృతః | - | బాహువులుగా చేయబడ్డాయి |
| యత్ వైశ్యః | - | వైశ్య వర్ణుడెవడో అతడు |
| అస్యః | - | ఆ పురుషునికి |
| ఊరూ | - | ఊరువు లాయెను |
| శూద్రః | - | శూద్ర వర్ణుడు |
| పద్భ్యామ్ | - | పద స్థానంలో |
| అజాయత | - | జనించినాడు |

వ్యాఖ్య :

యజ్ఞ పురుషుని ముఖమండలం దివ్య వాగ్వైభవ మణికేంద్రం. అది మహిమాన్వితం. అఖండ ఆకాశదీపం. అది బ్రహ్మస్థానం. బ్రాహ్మణీయం. యజ్ఞ పురుషుని భుజద్వయం అద్భుతబలోపేతం. దుష్టశిక్షణకు శిష్టరక్షణకు అది ఆలవాలం. బలరాజం. అది రాజస్థానం. అది క్షాత్ర క్షేత్రం. యజ్ఞ పురుషుని ఊరుద్వయం మూలపీఠం. బలిష్టతకు , సుస్థిరతకు, ఆలోచనకు, ఆర్థిక వ్యవస్థకు, కృషికి, గోరక్షణకు, ధర్మరక్షణకు చర్చావేదిక. అది వైశ్యస్థాన వైశిష్ట్యంగలది.

యజ్ఞ పురుషుని పాదద్వయం దేహానికి మూలాధారం. పాదం పదం. ఆ పదం వేగగమనానికి భారం వహించటానికి మరి ఇంకా ఎన్నో తీరుల ఉపయోగపడుతుంది. ఆ పాదం పూజా యోగ్యం. అది శూద్ర వర్ణ స్థానం. సుస్థిర పదం ఆక్రమించింది. ఇది నేటి కులవ్యవస్థకాదు. వర్ణవ్యవస్థ. ఇది పవిత్ర సువర్ణ వ్యవస్థ.

# నందలాల్ బోస్ - గాంధీజి

కళాచార్య నందలాల్ బసు శాంతినికేతన్‌లో చిత్రకళా పీఠాధ్యక్షులుగా వుండేవారు. భారతదేశం గర్వించదగిన మహామనీషి శ్రీ బసు.

ఒకమారు, కళాకారులొకరు, శాంతినికేతన్‌కు వచ్చారు. బసుగారి చిత్రాలను చూడాలన్న తమ కోరికను తెలిపారు. 'అయ్యా, మీరు రేపు, ఎల్లుండి ఇక్కడే బస చేయండి. అన్నిటిని చూపిస్తాను' అన్నాడు బసు. ఆగంతకుడు, 'అంత తీరికలేదు. రేపు ఉదయం రైల్లో తిరుగు ప్రయాణం పెట్టుకొన్నాను' అన్నాడు. 'ఏమిటి, మీరు రెండు గంటల్లో నా ముప్పదేళ్ళ కృషిని అధ్యయనం చేస్తారా? అదెలా సాధ్యం' అన్నారు బసుగారు.

గురుదేవ్ టాగూరు, గాంధీజిగార్లు నందబాబును ఎంతగానో గౌరవించేవారు. నందబాబు, గాంధీజిల మధ్య జరిగిన ఉదంతం.

ఒకమారు ప్రముఖ విద్వాంసుడు, రచయిత దిలీప్ కుమార్‌రాయ్, గాంధీజితో చిత్రకళను గురించి, గాంధీజి అభిప్రాయాలను తెలుసుకోగోరారు. సమాధానంగా గాంధీజి "ప్రకృతి అంతా కళాత్మకం. ఎటుచూచినా ఆనందప్రదంగా వున్నప్పుడు మానవ నిర్మితమైన కళ, ఆనందం ప్రసాదించ గలదా? కొండ, వాగు, కోన, నది, పచ్చికబీళ్ళు, మేఘాలు, అడవులు మన ఎదురుగా వున్నాయి. వీటిముందు మానవ నిర్మితమైన కళ కేవలం కృత్రిమమైనవి కదా? వీటివల్ల మనకేం లాభం?' అన్నారు ఈ విషయాన్ని దిలీప్ కుమార్ రాయ్ తమ 'అమంగ్ ద గ్రేట్" గ్రంథంలో పేర్కొన్నారు. గాంధీజి అన్న మాటలు, నందబాబు చెవిలో పడినాయి. గాంధీజి, శాంతినికేతనం వచ్చినప్పుడల్లా అచటి గాయని సావిత్రిగారి గానం వినేవారు. అలా మరోమారు శాంతి నికేతన్ వచ్చినప్పుడు, రవీంద్రకవి రచించిన నాలుగు గీతాలను పాడమని, సావిత్రిగార్కి కబురుచేశారు. ఈ సంగతి విన్న, నందబాబు, సావిత్రి గారిని గాంధీవద్దకు, వెళ్ళవద్దని చెప్పి, స్వయంగా వెళ్ళారు. సావిత్రిగారెందుకు రాలేదని గాంధీజి ప్రశ్నించారు. అప్పుడు నందబాబు "ఆమె రావలసిన పనిలేదు" అని ఆమెను తానే నివారించానని అన్నారు. ఎందుకంటే "పక్షుల మధురస్వరం, సముద్రపు హోరు, నదులు గలగల, మొదలగు ప్రకృతి వినిపించే సంగీతం వున్నప్పుడు, మానవుడి గానమెందుకు? మానవుడి సంగీతం కృత్రిమమైందికదా? గాంధీజి, నందలాల్ బసు గారి మాటల్లోని అంతరార్థం గ్రహించారు. గట్టిగా నవ్వారు. నందబాబు చేతుల్లో చేయివేసి తమ తప్పును ఒప్పుకొన్నారు.

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

విజ్ఞానవాణి - 4

## సైకిలు ముందు ఫోర్కు వంకర తిరిగి ఉంటుంది. ఎందుచేత?

ఇప్పుడు కన్పించే సైకిళ్ళన్నింటికి ముందు ఫోర్కు వంకర తిరిగి ఉంటుంది. స్టీరింగ్ తల నుండి గీచిన మధ్యరేఖ (చుక్కలగీత) చక్రం మధ్యనుండి గీచిన లంబ రేఖ టైరు నేలను తాకినచోట కలుస్తాయి. దీనివల్ల సైకిలు ఎక్కడైనా వంగినప్పటికిని నిటారుగా వచ్చేందుకు దోహదం చేస్తుంది.

మరికొంచెం వివరంగా చెప్పుకోవాలంటే సైకిలు హేండిల్‌బార్‌కి ఒకవైపున బరువైన సంచీ తగిలించా మనుకోండి. అప్పుడు సైకిలు బ్యాలన్స్ చేయడం కష్టమవుతుంది. నిరంతరం కొంత బలం ప్రయోగిస్తూ సైకిలు తిన్నగా ఉండేటట్లు చేయవలసి వస్తుంది.

అదే విధంగా ముందు ఫోర్కు నిటారుగా ఉంటే సైకిలు నిటారుగా వుండేటట్లు బ్యాలన్సు చేయడానికి నిరంతరం బలం ఉపయోగించాలి. ఫోర్కు వంకరగా ఉండడం వల్ల ఈ బలం ఉపయోగించనవసరంలేదు.

- సి.వి. సర్వేశ్వరశర్మ

# కలియుగం 'కలహయుగం' గా మారిపోతున్నది

"సూక్ష్మమైనట్టి అణువున సూక్ష్మమగుచు
మేటి వస్తువునందున మేటియగుచు
అంతటను సర్వసాక్షియై అలరునట్టి
ఆత్మయే బ్రహ్మ బ్రహ్మయే అణువునగును"

"అణోరణీయాం మహతో మహీయాం" ఈ జగత్తులో పంచభూతములు ప్రత్యేకంగా మనం చూచుచూ అనుభవిస్తున్నప్పటికినీ, పంచభూతముల స్వరూపమే మానవుని యొక్క దేహము. పంచభూతములనగా పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము - వీటినే శబ్ద, స్పర్శ, రూప, రస గంధములని పిలుతురు.

పృథ్వీ పుత్రుడుగనుకనే, అర్జునుని 'పార్థ!' అని పిలిచాడు కృష్ణుడు. అనగా ప్రతి మానవస్వరూపము 'పార్థ' స్వరూపమే. ప్రతి మానవుడు 'పార్థు'డే. ఈ పృథ్వియందే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు లీనమైఉన్నాయి. 'ఏకాత్మమమాత్మ' అని చెబుతూవస్తారు. ఈ పంచభూత స్వరూపమైన ఈ ప్రకృతి చాలా శక్తివంతమైనది. దీనికి కదిలేటటువంటి శక్తి ఉన్నది. తిరిగేటటువంటి శక్తి ఉన్నది. కాని ఒక స్థానము నుండి మరో స్థానమునకు పోయేటటు వంటి శక్తిమాత్రంలేదు. ఉన్న స్థానమునందే తిరుగుతుంది. దీనిలోనే సర్వగుణములు ఇమిడి ఉంటున్నాయి. ఈ పృథ్వియందు పర్వతములు, అడవులు, పట్టణములు, పల్లెలు, నదులూ ఉన్నాయి. సర్వమునూ ఈ పృథ్వియే మోయుచున్నది. ఈ పృథ్వి తిరుగుతున్నది కాబట్టి, ఇవి కూడా తిరుగుతుంటాయా? అనే సందేహం సైన్స్ తెలియనివారికి కలుగుతుంటుంది. ఈ పృథ్వి ఇంత వేగంగా తిరుగుతున్నప్పుడు, ఈ పృథ్విపైన ఉన్నవాటి గతి ఏమిటి? ఈ పృథ్వికి స్వాతంత్ర్యం లేదు. పరాధీనమైనటు వంటిది. దీనియందు భగవత్ శక్తి అంతర్భూతంగా ఇమిడి ఉంటున్నది. ఆ శక్తియే అన్నింటిని Balance గా మోస్తూ ఉన్నది. ఈ పృథ్వి మీద వున్నవాటిని పృథ్వి తిరుగకుండా భగవంతుడే చూచుకుంటున్నాడు. రైలు పరిగెత్తినట్లుగా, రైల్వే లైను కూడా పరిగెత్తితే ప్రయాణీకుల గతి ఏమిటి? ఈ పృథ్వికి ఆకర్షణశక్తి ఎక్కువగా ఉండటం చేతనే, పైనఉన్న పర్వతములు, వృక్షములూ..... ఏమాత్రం కదలకుండా ఉంటున్నాయి. పృథ్వి యొక్క తత్త్వము చాలా విచిత్రమైనటువంటిది. ఇది భగవంతుని యొక్క అంగము. మన దేహంలో కాళ్ళు, చేతులు, ముక్కు, చెవులు, నోరు, కండ్లు ఉన్నాయి. ఈ ఇంద్రియములన్నీ దేహానికి అంగములు. దేహము సమాజానికి అంగము. సమాజానికి మానవత్వము అంగము. మానవత్వమునకు పృథ్వి అంగము. పృథ్వికి పరమాత్మయే అంగము. కనుక పృథ్వి అంతయూ పరమాత్ముని యొక్క అంగమే. సర్వాంగములు కూడనూ పృథ్వితో కూడివుండినటువంటివే, కనుకనే

## భగవాన్ సాయి హెచ్చరిక

భగవంతుడ్ని అత్యంత సూక్ష్మస్వరూపుడు అన్నారు. ఎప్పుడు సూక్ష్మస్వరూపుడవుతాడు? సర్వత్రా వ్యాపించినటు వంటి ఈ భూమికి సర్వత్రా వ్యాపించినటువంటి భగవంతుడు కూడనూ అత్యంత సూక్ష్ముడుగా ఉంటాడు. అనగా గుణములు వుండినంతవరకునూ, తాను స్వతంత్రుడుగా ఉండడు. క్రమక్రమేణా ఈ గుణములు తగ్గిన తరువాత, తాను సర్వవ్యాప్తిగా మారుతాడు.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు - ఈ ఐదు గుణములూ భూమియందుంటున్నాయి. కనుకనే భూమిని ఇటుతీసి అటుపెట్టటానికి, అటు తీసి ఇటు పెట్టటానికి వీలు కాదు. క్రమక్రమేణా దానికి రెండవ భూతము జలము. ఈ జలములేని స్థానములేదు. కనిపించినా, కనిపించకపోయినా, సర్వత్రా భూమియందుంటున్నది. కనుక జలము సర్వమయం. ఈ జలములో ఒక గుణం తగ్గిపోయింది. శబ్ద, స్పర్శ, రూప, రసములుంటున్నాయి గాని, గంధము దానిలో లేదు. కనుక ఈ జలము కొంతవరకు కదులు తున్నది. తేలిక అయిపోయింది.

మూడవది అగ్ని. ఇది మహాశక్తివంతమైనది. దీనిలో

శబ్ద, స్పర్శ, రూపములు మాత్రమే ఉన్నాయి. రస గంధాదులు లేవు. కనుకనే ఈ అగ్ని సర్వత్రా వ్యాపించుతూ వచ్చింది. ఇది ప్రతిమానవుని యందూ ఉంటున్నది. అదే 'జఠరాగ్ని'. జలమునందు కూడనూ 'బడబాగ్ని' ఉంటున్నది. వృక్షముల యందుకూడనూ అగ్ని వున్నది. ఒక చెట్టు మరొక చెట్టు రాసుకుంటే అగ్ని పుడుతుంది. రాతిలో కూడా అగ్ని ఉన్నది. ఒక రాతితో మరొకరాతిని కొడితే అగ్ని వస్తుంది. కనుకనే ఈ మూడవ భూతమైన అగ్నియందు కూడనూ సర్వమూ ఇమిడి ఉన్నది. కాని గుణములు రెండు తగ్గిపోవటం వలన ఇది క్రమక్రమేణా పైకి కూడా లేస్తున్నది.

నాల్గవది వాయువు. వాయువులేని స్థానమేలేదు. కుండలో కూడా గాలి వుంటుంది. ఏ పదార్థమునందు చూచినా గాలి వుంటుంది. ఈ గాలియే సర్వశక్తులకూ మూలకారణం. మానవుని ప్రాణమునకు కూడా గాలియే మూలం. ఈ వాయువులోపల మూడు గుణములు తగ్గిపోయినాయి. శబ్ద, స్పర్శలు మాత్రమే ఉన్నాయి. రూప రస గంధాదులు లేవు.

## సి.పి. బ్రౌన్ గ్రంథాలయం

దీ. 1998 సం॥లో బ్రౌన్ ద్విశతజయంతి ఉత్సవాల సందర్భమున, కడపలో ఒక గ్రంథాలయం, పరిశోధనా కేంద్రం కోసం భవనం నిర్మించబడింది. ఈ గ్రంథాలయంలో విభిన్న భాషలలో అపురూపమైన 22 వేలకు పైగా గ్రంథాలు ఉన్నాయి. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, ఈ గ్రంథాలయాన్ని పరిశోధనా కేంద్రముగా గుర్తించింది. ఈ గ్రంథాలయంలో కంప్యూటర్, జిరాక్సు, ఫ్యాక్స్ వసతులు కూడా కలవు. ఈ గ్రంథాలయమును ఇంకా సాహిత్య పరిశోధనా సంస్థగా అభివృద్ధి చేయాలని నిర్వాహకుల ఆకాంక్ష. సహకారం చేయదలచినవారు ఈ క్రింది చిరునామా వారితో సంప్రదించవచ్చును.

**డాక్టర్ జానమద్ది హనుమచ్ఛాస్త్రి, కార్యదర్శి**
**'మహతి', 1/1845, గాంధీనగర్,**
**కడప - 561 004.**

ఐదవది ఆకాశము. ఆకాశం సర్వత్రా వ్యాపించినట్లుగా కనిపిస్తుంది. మనం చూచే మేఘములు ఆకాశం కాదు. శబ్దమే ఆకాశ గుణం. ఆకాశం ఎక్కడ వున్నదంటే, పైకి చూపిస్తారు. ఎక్కడ శబ్దమో అక్కడ ఆకాశ మొంటున్నది. ఆకాశము యొక్క గుణం శబ్దమే 'ఆకాశం గగనం శూన్యం' అన్నారు. కనుక ఈ ఆకాశము నందు 'శబ్దము' ఒక్కటి మాత్రమే ఉంటున్నది. స్పర్శ, రూప, రస, గంధాదులు నాలుగూలేవు. ఈ నాలుగూ లేకపోవటం చేత, ఈ ఆకాశం సర్వత్రా వుండినట్లుగా గోచరిస్తుంది.

ఆఖరిది పరమాత్మ. ఆ పరమాత్మయందు ఆ శబ్దము కూడా లేదు. కనుకనే పరమాత్మ సర్వత్రా వ్యాపించి వుంటున్నాడు. చాలా తేలిక అయిపోతున్నాడు. "**సర్వతః ప్రాణిపదం తత్సర్వతోక్షి శిరోముఖం**" అన్నట్లు సర్వ మూలముల యందు కూడనూ శిరస్సుగాను, పాదములు గాను కనిపిస్తుంటాడు. **ఆకాశము కంటె అతి సూక్ష్మమైనటు వంటివాడు పరమాత్ముడు.** అటువంటి పరమాత్ముడు పంచభూతములయందు కూడనూ ఏకస్వరూపుడుగా ఉంటున్నాడు. కానీ ప్రతి దానికి కూడనూ ఒకఅంశము ఉంటున్నది. "**మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః**". భూమి భగవంతుని అంశమే. జలమూ భగవంతుని అంశమే. అగ్ని భగవంతుని అంశమే. వాయువు భగవంతుని అంశమే. ఆకాశమూ భగవంతుని అంశమే. సర్వమూ భగవంతుని అంశములు. కనుకనే వీటన్నింటిని దైవ స్వరూపకంగా ఆరాధిస్తూ వచ్చారు ప్రాచీనులు. అందుకనే భూదేవి, వరుణదేవుడు, అగ్నిదేవుడు, వాయు దేవుడు, ఆకాశదేవుడు అన్నారు మన పెద్దలు. అందరినీ దేవుళ్ళుగా భావిస్తూ పూజిస్తూ వచ్చారు. సర్వులనూ రక్షించేది భూమాత గనుకనే, భూదేవిని మొట్టమొదట ఆరాధిస్తూ వచ్చారు మన ప్రాచీనులు. విజ్ఞానశాస్త్రవేత్తలు దీనిని హాస్యాస్పదంగా భావించారు. భారతీయులు మూర్ఖులని విమర్శించారు. వారికి అంతరార్థములు తెలియవు. కేవలం పదార్థ శాస్త్రమును మాత్రమే ప్రమాణంగా తీసుకుంటారువారు. భూమాత లేకపోతే మానవులకు మనుగడేలేదనే సత్యం వారికి తెలియదు. సర్వులనూ రక్షించేది, పోషించేది భూమాతే గదా! ప్రతి దాని యందూ పరమాత్మతత్త్వం అంత ర్భూతంగా ఉంటుంది.

లోకంలో దైవత్వాన్ని గుర్తించటం చాలా కష్టం. ఏది దైవత్వం? ఏది కాదు? నిర్ణయం చేయటం ఎవరికీ సాధ్యం కాదు. సూర్యుడు ఉన్నప్పుడే కిరణాలు వస్తుంటాయి. భగవంతుడు ఉండిఉన్నప్పుడే ప్రకృతి ఆవిర్భవిస్తుంది. భగవంతుడు సృష్టించిన పంచభూతముల యందు, ఇంతశక్తి ఉన్నప్పుడు సృష్టికర్తలో యింకా ఎంతశక్తి ఉండాలి? ఈ సత్యమును ప్రతి మానవుడు గుర్తించుకొనలేడు. బాంబును తయారు చేసినవాడు ఎక్కడ వున్నాడో! వాని పేరుచెప్పినా ఎవరు పట్టించుకోరు. అతనిని చూచినా ఎవరూ భయపడరు. కాని వాడు తయారుచేసిన బాంబు పేరు చెబితే మాత్రం భయపడుతారు. అదే విధముగనే పంచ భూతములను సృష్టించిన పరమాత్మను చూస్తే భయంలేదు. సృష్టించబడిన పంచభూతములను చూస్తే మాత్రం భయం వేస్తుంది. భగవంతుని యొక్క తత్త్వాన్ని ఏ విధంగా వర్ణించాలో, ఎవరికీ చేతకాదు. ఎంత వర్ణించినా అది చాలా తక్కువే.

మొట్టమొదట భూమి యొక్క తత్త్వాన్ని మనం చక్కగా తెలుసుకోవాలి. భూమి ఎంతో భారాన్ని మోస్తున్నది. ఆ భారం ఎప్పుడు తగ్గుతుంది? భూభారం తగ్గాలంటే జనాభా తగ్గాలంటారు కొందరు. జనాభా తగ్గితే భారం తగ్గుతుందా? అప్పుడూ తగ్గదు. ఎప్పుడూ భారం భారం గానే ఉంటుంది. నీలోని భారాన్ని నీవు తగ్గించుకున్నప్పుడు, భూమికి కూడా భారం తగ్గుతుంది. నీలోని భారం ఏమిటి? కోరికలే నీ భారాలు. ఈ కోరికలనేవి తగ్గించుకుంటే, నీవు భగవంతునికి కూడా భారంకావు. కనుకనే Less Luggage more comfort make travel a pleasure అన్నారు. కనుక మన భారాన్ని తగ్గించుకోవటానికి ప్రయత్నం చేయాలి. అప్పుడే భగవంతునికి కూడా భారంగా ఉండదు. మన భారాలు అధికమైనకొలదీ, భగవంతునికి కూడా భారమే. అయితే ఆ భారాన్ని భగవంతుడు మోయటంలేదు. తాను చాలా సూక్ష్మస్వరూపుడు. అన్నింటికన్నా గుప్తమైనటు వంటిది. తన భారాన్ని తన పైననే వేసుకుంటాడు. ఎవరి భారాన్ని వారి తలపైననే వేస్తుంటాడు. ఏమీ పట్టనట్లుగా నటన చేస్తాడు. కాబట్టి పంచభూతములయందునూ, తానుండినప్పటికినీ, పంచభూతములు తన స్వాధీనంలో వుండినట్లుగా కనిపిస్తుంది. అదే విషయమును ఒకానొక సమయంలో గోపికలు కూడా చెప్పారు.

**"నిను కనుగొనగలమా! కృష్ణా! నిను కనుగొనగలమా! కృష్ణా"** అన్నారు గోపికలు. నిను ఏ విధంగా కనుగొనటానికి సాధ్యమవుతుంది? ఎవరికీ సాధ్యంకాదు. ఈ పంచ భూతముల యొక్క తత్త్వాన్ని చక్కగా గుర్తించడని అరవిందుడు కూడా చెప్పారు. ఈ పంచభూతములు లేనటువంటి స్థానంలేదు. సర్వత్రా యివే ఉంటున్నాయి. ఈ పంచభూతముల అంగమే ఈ దేహము కనుక ఇది కూడా పంచభూతముల స్వరూపమే. దీనిని **'పాంచ భౌతిక స్వరూపము'** అన్నారు. పంచభూతముల (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు) అంగమే కనుక దానిని 'పంచాంగము' అన్నారు. కనుక ఈ అంగముల యొక్క స్వరూపాన్ని చక్కగా గుర్తించుకొని వర్తించాలి.

**1. శబ్దము -** ఆ శబ్దము ఎక్కడ కనిపిస్తుంది? ఎట్లా వినిపిస్తుంది? దీనిని కేవలం చెవులతో వింటున్నాం. ఆ శబ్దం ఏ రీతిగా వస్తున్నది. వేరే పిచ్చి పిచ్చి శబ్దాలు కావు. 'ఓం'కారం ద్వారా వస్తున్నది. కాబట్టి నీవు వినవలసినది ఓంకార స్వరూపమునే. 'అ'కార, 'ఉ'కార, 'మ'కారముల స్వరూపమే. 'ఓం' కారము. విమానం ఎక్కడో బయలు దేరింది. మన దగ్గరకు వచ్చేటప్పటికి శబ్దం ఎక్కువగా వినిపిస్తుంది. అదే విధంగా 'అ' కారం ఎక్కడో ప్రారంభ మైంది. 'అ,ఉ,మ్' - ఈ మూడింటి శబ్దముల తరంగమే మానవుని యొక్క స్వరూపం. కనుక మనం వినవలసింది ఈ 'ఓం'కారనాదమే. అదియే ఆకాశ స్వరూపము.

**2. వాయువు -** ఈవాయువు యొక్క స్వరూపమేమిటి? కేవలం ఒక విధమైన ప్రాణమును తెచ్చియివ్వటమే. వాయువులేని స్థానమేలేదు. వాయువు లేకపోతే మనం జీవించనేలేము. కనుక మనం తీసుకోవలసింది. 'సో'... వదలవలసింది 'హం'... అదే సో$\approx$హం. ఈ 'సో'... అనేది ఆక్సిజన్ (ప్రాణవాయువు). 'హం' అనేటటువంటిది కార్బన్ డయాక్సైడ్ (బొగ్గుపులుసు వాయువు). ఆక్సిజన్‌ను తీసు కోవాలి, కార్బన్‌డయాక్సైడ్ వదలాలి. చెడ్డను వదిలిపెట్టాలి, మంచిని స్వీకరించాలి. ఇదే గాలి బోధించేటటువంటి పాఠము. నీవు ఫలమును స్వీకరించి, మలమును విసర్జించు. దీనిని ఎందుకు యిచ్చాడంటే మంచిని పొందడానికి యిచ్చాడు. ఈ అంతరార్థమును ఎవ్వరూ గుర్తించడానికి ప్రయత్నించటంలేదు. గుర్తించినను లెక్కచేయటంలేదు. కనుక మనం వదలవలసింది చెడ్డ పదార్థమును. వృక్షాలలో

ప్రాణం వున్నట్లు మనకు కనిపించదు. కాని ఆ వృక్షాలు ఆక్సిజన్‌ను అందరికీ అందిస్తున్నాయి. అందరు మనుషులు వదిలినటువంటి కార్బన్‌డయాక్సైడ్‌ను స్వీకరిస్తున్నాయి. మంచిని ఇచ్చి, చెడ్డను అవి స్వీకరిస్తున్నాయి. ఈ వృక్షాలకు వున్న విజ్ఞత మనుషులకు ఉన్నదా? కనుక మనం చెడ్డను విసర్జించాలి. మంచిని స్వీకరించాలి. ఇది వాయువు అందించే సందేశం.

**3.** అగ్ని - ఈ అగ్ని అన్నింటిని భస్మం చేస్తుంది. సుఖదుఃఖములు రెండింటిని భస్మం చేస్తుంది. మంచి, చెడ్డలను కూడా భస్మం చేస్తుంది. బేధరహితమైనటువంటిది అగ్ని. ఇలాంటి పవిత్రమైనటువంటి అగ్ని తత్త్వాన్ని మనం 'జ్ఞానాగ్ని'గా తీసుకోవాలి. మన యందు బడబాగ్ని, జఠరాగ్ని ఉంటున్నది. కాని ఈ 'ప్రాణాగ్ని' అనేటటువంటి దానిని మనం బోధించటంలేదు. మానవుని యందు సర్వ సద్గుణములూ వుండవచ్చును. కాని 'ఆత్మగుణం' మాత్రం లేదు. ఆత్మతత్త్వమే నిజమైనటువంటి బోధ. ఆత్మజ్ఞానం అత్యవసరం. లౌకిక జ్ఞానం, భౌతిక జ్ఞానం అన్నీ ఉంటున్నాయి. కాని ఆత్మజ్ఞానం లేదు. ఆత్మ జ్ఞానమును ప్రబోధించేటటువంటిదే 'అగ్ని'. సర్వత్రా ప్రకాశింపజేసే టటువంటిదే 'అగ్ని'. **'తమసోమాజ్యోతిర్గమయ'** జ్యోతి వున్న చోట 'తమసు' వుండదు. కనుక అగ్ని మనకు 'తమసు' ను దూరం చేస్తుంది. చెక్కను భస్మం చేస్తుంది. ఇందులో 'రామ' నామం కూడా చక్కగా ఇమిడి వున్నది. ర...అ...మ... - ఈ మూడు అక్షరాలతో చేరింది 'రామ'. 'ర' అనగా 'అగ్ని', 'అ' అనగా చంద్రుడు, 'మ' అనగా సూర్యుడు. సూర్యుడు సర్వులకు ప్రకాశమును అందిస్తున్నాడు. చీకటిని దూరం చేస్తున్నాడు. ప్రాణాన్ని అందిస్తున్నాడు. ఇక చంద్రుడు తాపమును చల్లారుస్తున్నాడు. హృదయాన్ని చల్లపరుస్తున్నాడు. ఈ 'అగ్ని' పాపములను భస్మం చేస్తున్నది. దుఃఖములను భస్మం చేస్తున్నది. కనుక ర...అ...మ అనగా పాపములను నశింపజేయటము, చీకటిని పోగొట్టటం, ప్రకాశాన్ని అందించటం. ఈ మూడు గుణములు 'రామ' నామంలో ఉంటున్నాయి. కనుకనే గార్గుడు 'రామ' అని పేరు పెట్టటం లోని అంతరార్థం ఇదే. కనుక ఈ అగ్ని ఈ విధంగా ఉపకారం చేస్తున్నది.

**4. జలము** - ఈ జలము చాలా పవిత్రమైన ప్రాణమును చేకూరుస్తుంది. ఎవరైన మూర్ఛిల్లుతే, వారి పైన నీళ్ళు చల్లుతారు. నీరులో ప్రాణశక్తి ఉన్నది. అందుకోసమనే 'అహంవైశ్వానరో భూత్వా.....' అని ప్రార్థన చేస్తాం. నీవు భుజించిన తరువాత ఇక్కడ ఎవరున్నారు? ఏదో ప్రార్థన చేస్తున్నారే! అంటే ఓ భూతుడా! నేను అహంకారంగా ఉన్నాను. వైశ్వానర రూపంలో నేను నీలో ఉంటున్నాను. నీవు భుజించిన ఆహారమునంతా నేను భస్మం చేస్తున్నాను. నీకు శక్తిని, పుష్టిని అందిస్తున్నాను. కాబట్టి నాలోవున్న తత్త్వము జలతత్త్వమే గ్రహించు! ఈ జలం ఇంత ఉపకారం చేస్తున్నది.

**5.** పృథ్వి - సర్వ విధములా సహకారం అందిస్తున్నది. ఆహారమును అందిస్తున్నది. చెట్లను పోషిస్తున్నది. మేడలు మిద్దెలు కట్టిస్తున్నది. అన్నింటినీ యిస్తున్నది. భూమి ఇవ్వనదంటూలేదు. సర్వఫలములను భూమి అందిస్తున్నది. కాని మానవుడు అందించవలసిన గుణములను మాత్రం అందించటంలేదు. అన్ని యుగములకంటే, కలియుగం తరించుటకు చాలా సులభమైన మార్గమన్నారు మహర్షులు. ఎందుకనగా, మనిషికి తెలివితేటలు కావల్సినంత ఉంటున్నాయి. విద్యనేర్వడానికి వీధివీధిన కావల్సినన్ని విద్యాలయాలుంటున్నాయి.. ఇక ధనసంపాదనకు కోటి మార్గాలున్నా సులభంగా కూడా సంపాదించటానికి అనేక మార్గాలున్నాయి. ఇన్ని మార్గాలున్నా మానవుడు సుఖానికి నోచుకోలేదు. దుఃఖమును నివారణ గావించుకోలేక పోతున్నాడు. దీనికి కారణమేమిటి? ప్రవర్తన సరీగాలేక పోవటమే. ఈ ప్రవర్తనకు గుణమే మూలాధారం. గుణం వుంటే దేనినైనా సాధించవచ్చును. **'గుణములేని సుతుడు, గురిలేని విద్యలు'** వుండి ఏమి ప్రయోజనం? సుతుడు గుణం కలవాడై వుండాలి. విద్యలయందు 'గురి' ఉండాలి. కాబట్టి సుతుడు గుణవంతుడై ఉండాలి. మన ప్రవర్తన లోపల సరియైన గుణం వుండాలి. గుణసహితమైన ప్రవర్తనే మానవునికి నిజమైన జీవితం. అయితే ఈనాడు మానవుడు గుణరహితమైన ప్రవర్తన కలిగివుంటున్నాడు. కనుకనే శాంతి సుఖములు వానిదగ్గరకు రావటంలేదు. ఎంతో దూరంగా ఉంటున్నాయి. మంచి గాలి కూడా దగ్గరకు రావటంలేదు. ఎలా వస్తుంది. ప్రపంచంలో అన్ని పదార్థములూ కలుషితమై నాయి. దీనికంతటికీ మూల కారణం. మానవుని యొక్క ప్రవర్తనలో దోషమే. ఈనాడు పంచభూతములన్నీ పొల్యూషన్ అయినాయి. తినే తిండి, త్రాగే నీరు, పీల్చేగాలి అంతా

'పొల్యూషన్' అయిపోయినాయి. కారణమేమిటి? మానవుని ప్రవర్తనలో ఉన్న దోషమే. అన్నీ చెడ్డభావాలే, అన్నీ చెడ్డ చేష్టలే, అన్నీ చెడ్డనడతలే ఇలాంటివి వుంటున్నాయి. మానవునిలో వుండవలసిన దయ, ప్రేమలు అడుగున పడిపోవటంచేతనే, భూమిలో వున్ననీరు కూడా లోపలికి పోతున్నది. ఈ దుర్మార్గుని వద్దకు రావటానికి అవి కూడా భయపడి పోతున్నాయి. పంచభూతములు కూడా, ఈనాటి మానవుని ప్రవర్తన చూచి భయపడి పోతున్నాయి. అసలు ఈ పంచభూతములలోవున్న తత్త్వము అంతా పరిశుద్ధమైనటువంటిదే. మన ప్రవర్తనలచేతనే అవి కలుషితం (పొల్యూషన్) అయిపోతున్నాయి.

కలియుగం తరించడానికి చాలా సులభమైనటువంటిదే. **కాని ఈనాడు ఈ కలియుగం, 'కలహాయుగము' గా మారిపోతున్నది.** దీనికి కారణం? మానవుని దుష్ప్రవర్తనలే. మానవుడు పరిశుద్ధమైన భావాలు పెంచుకోవాలి. ముఖ్యంగా ఈనాటి విద్యార్థులు పవిత్రమైన గుణాలను పెంచుకోవాలి. భగవంతుడు ప్రసాదించిన పంచభూతములను సాక్షాత్కారం చేసుకొని, సార్థకం చేసుకోవాలి. ప్రతి దానిని సద్వినియోగపరచుకోవాలి.

భజనలు ఎందుకోసం చేస్తున్నాం? దీనిని చక్కగా విచారించాలి. ఎందుకనగా భగవత్ నామాన్ని చక్కగా స్మరిస్తున్నాం. ఈ నామం గాలితరంగాలలో చేరిపోతున్నాయి. ఇవి తరంగాలలో చేరిపోయి, అందులో వున్న చెడ్డను భస్మం చేస్తున్నాయి. చెడ్డనంతా మంచిని చేయడానికే భగవత్ భజన. మనం ఎట్టి మంటను పెడుతున్నామో, అట్టిపొగవస్తుంది. ఎట్టి పొగవస్తుందో, అట్టి మేఘములు ఏర్పడుతాయి. ఎట్టి మేఘమో అట్టి వర్షము. ఎట్టి వర్షమో అట్టి పంట. ఎట్టి పంటనో అట్టి వంట. కనుక మనం వేసేటటువంటి మంట మంచి మంట వేయాలి. చెడ్డ పదార్థములన్నీ తీసుకొని వచ్చి మంటలో వేస్తే, చెడ్డ పొగవస్తుంది. అది చెడ్డ మేఘముగా మారి చెడ్డ వర్షమే కురుస్తుంది. చెడ్డ వర్షం కురిసినప్పుడు చెడ్డ పంటలే పండుతాయి. చెడ్డ పంటలు పండినప్పుడు చెడ్డ వంటనే మనం తింటాం. చెడ్డ వంటలు మనం తినినప్పుడు చెడ్డ రోగాలే మనకు వస్తాయి.

సముద్రజలాలను ఆవిరిగా మారుస్తున్నాడు సూర్యుడు. అసలు సముద్రజలం ఉప్పుగా ఉంటుంది. ఆవిరిగా మారినప్పుడు తియ్యగా మారిపోతుంది. ఆ తియ్యదనాన్ని, మేఘంగా రూపొందింపజేస్తున్నాడు. ఆ మేఘములో తియ్యని జలాలుగానే రూపొందుతున్నాయి. తిరిగి వర్షంగా కురిపిస్తున్నాడు. మంచి ప్రేమ వర్షంగా కురుస్తుంది. ఈ ప్రేమ వర్షమే గంగా జలంగా మారుతున్నది. కురిసే వర్షం ప్రేమ వర్షం. ఆవిరిగా మారి ఏర్పడిన మేఘము సత్యమనే మేఘము. ఆ సత్యమనే మేఘము నుంచి ప్రేమ జలం వస్తుంది. ఈ ప్రేమ జలమంతా అనుగ్రహసాగరంలో చేరిపోతుంది. కనుక మనం చేసే ప్రయత్నములు పవిత్రమైనవిగా ఉండాలి. నిరంతరం దైవనామాన్నే స్మరిస్తుంటే, గాలి అంతా పరిశుద్ధమైపోతుంది. ఈ శబ్ద తరంగము

## భగవాన్ శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ బాలబాలికల ప్రతిభ

"భారతీయ సంస్కృతి - ఆధ్యాత్మికం" అను విషయం మీద వేసవి తరగతులలో పాల్గొనిన మూడు వేలమంది బాలబాలికలకు వ్రాత పరీక్ష నిర్వహించడమైనది. ఆ పరీక్షలో పాల్గొనిన బాలబాలికలందరికి 90% మార్కులు రావటం విశేషం. అందులో ఒక బాలికకు, ఒక బాలునికి నూటికి నూరు శాతం మార్కులు రావటం అత్యంత ఆశ్చర్యకరమైన విషయం ఆ విధంగా నూరు శాతం మార్కులు సంపాదించిన బాలునకు బంగారపు ఉంగరం, బాలికకు బంగారు గొలుసు సృష్టించి, బహూకరించి, ఆశీర్వదించారు ది. 29-5-2000న సాయీ రమేష్ హాల్ (బృందావనం)లో జరిగిన సభలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ప్రతిభావంతులకు నిలయం శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయం ప్రతిభకు పట్టాభిషేకం చేశారు శ్రీ సత్యసాయి.

ది. 29-5-2000న ఉదయం శ్రీ సత్యసాయి కాలేజీ ఆడిటోరియం (బృందావనం)లో జరిగిన సభలో భగవాన్ సాయి చేబట్టబోతున్న భవిష్యత్తు కార్యక్రమాన్ని వివరిస్తూ కోహినూర్ వజ్రమును సృష్టించి, బాలబాలికలను, అధ్యాపకులను ఆశ్చర్యచకితులను గావించారుట. "భారతదేశ ఔన్నత్యాన్ని చాటి, ప్రపంచంలో 'భారత్' ను అగ్రగామిగా నిలబెట్టటమే నా లక్ష్యం అన్నారు భగవాన్ సాయి.

గాలిలో కలిసి ప్రపంచమంతా సంచరిస్తుంటాయి. ఢిల్లీలో ఆకాశవాణి కేంద్రంలో ఎవరైనా పాడుతుంటే, ఒకే సమయంలో, దేశంలోని ఏ మూలనున్నవారైనా రేడియో ద్వారా వినవచ్చును. ఇది ఎట్లా సాధ్యమవుతున్నది? ఇది శబ్ద తరంగములతో కూడివస్తున్నది. అటులనే చెడ్డకూడా ప్రయాణం చేస్తున్నది. కనుకనే మంచి శబ్దాలను అభివృద్ధి పరుస్తే మంచి గాలే వస్తుంది. ఆ మంచిగాలిని మంచి మంచినే అనుభవిస్తాం. ఆ గాలిని మనం పీల్చు కుంటున్నాం. ఆ మంచి తరంగముల లోపలికి వెళ్ళి, లోపల నున్న చెడ్డ భావాలను కూడా పరిశుద్ధపరుస్తాయి.

**ప్రేమస్వరూపులారా!**

మీరంతా ప్రేమ జీవితమును గడపాలి. ఈ ప్రేమ జీవితమును మనం గడిపినప్పుడే, జగత్తంతా ప్రేమ మయంగా మారిపోతుంది. దానికి నేనే, మీకు సాక్షి. నాలో ఎప్పుడూ ప్రేమనే ఉంటుంది. మరే పదార్థం చేరటానికి వీలుకాదు. అయితే అప్పుడప్పుడు కొంచం 'బుస్' అంటాను. కాని అది కూడనూ ప్రేమనే. వర్షం కురుస్తున్నది. వర్షం కురిసేటప్పుడు వడగళ్ళు కూడా పడుతుంటాయి. ఆ వడగళ్ళ వలన దెబ్బలు కూడా తగులుతుంటాయి. కానీ అది కూడా నీరే. కాబట్టి నేను 'బుస్' అనేటటువంటిది కూడా ఒక వడగళ్ళ వర్షం వంటిదే. అది కూడా ఒక జలం వంటిదే. కాబట్టి నేను ఏది చేసినా మీ మంచి కోసమేగాని నా కోసంకాదు. నా నఖశిఖ పర్యంతమూ ప్రేమమయమే. కనుక ఆ ప్రేమ తత్త్వాన్ని మీరు అనుసరించండి.

తల్లిపాలను బిడ్డ త్రాగినట్లుగా, పువ్వులో వున్నటువంటి మకరందాన్ని తుమ్మెద తీసుకున్నట్లుగా మనుషులలోవున్న దైవతత్త్వాన్ని మనుషులే స్వీకరించాలి. తన మకరందాన్ని గ్రోలమని పువ్వులు ఏమైనా పిలుస్తున్నాయా? పిలువటం లేదు. తుమ్మెదలే పోయి, ఆ మకరందాన్ని గ్రోలుతున్నాయి. అదే విధముగ మంచివారి దగ్గరకు వెళ్ళి సత్సంగంలో చేరి, వారియందున్న మంచి తత్త్వాన్ని స్వీకరించాలి. దుర్జన సాంగత్యాన్ని విడనాడాలి. సత్సంగంలో చేరాలి.

**ప్రేమస్వరూపులారా!**

ప్రేమస్వరూపులైన మీరు, అందరినీ ప్రేమ స్వరూపులుగా చూచుకోవాలి. అందరూ మంచివారే. నీలోనున్న చెడ్డభావాలే నీకు చెడ్డను బోధిస్తున్నాయి. కనుక మొట్టమొదట నీలో మంచి భావాలను అభివృద్ధి పరచుకో. దైవచింతన చేయండి. దైవనామాన్ని విస్మరించకండి! అదియే ఈ దుర్గుణాలను నీ నుండి దూరం చేస్తుంది. ఎవరినీ దూషించకూడదు. దూషించేటటువంటి పలుకులు గట్టిగా పలుకకూడదు. అవి కూడా గాలిలో ప్రయాణం చేసి, ఎవరిలోనో ప్రవేశిస్తాయి. వారికి కూడా ఆవేశం వస్తుంది. చెడ్డవారితో చేరకండి. చెడ్డమాటలు మాట్లాడకండి. చెడ్డ చూపులు చూడకండి. కీచకుడు చెడ్డ చూపులు చూచాడు, భీమునితో తల పగలకొట్టించు కున్నాడు. కైకేయి చెడ్డమాటలు విన్నది, చెడ్డ పేరు తెచ్చుకున్నది. ఈనాడు 'కైకమ్మ' పేరు ఎవరైనా పెట్టుకుంటున్నారా? లేదు. కారణమేమిటి? చెడ్డమాటలు విన్నది కాబట్టి. శకుని చెడ్డమాటలు విని దుర్యోధనుడు సర్వనాశనమైనాడు. తన వంశాన్నే నాశనం చేసుకున్నాడు. ఒకవేళ చెడ్డమాటలువింటే, వాటిని ఇంకొకరికి చెప్పకూడదు. కనుక చెడ్డమాటలు వినకుండా, చెడ్డమాటలు మాట్లాడకుండా, చెడ్డపనులు చేయకుండా, చెడ్డచూపులు చూడకుండా పవిత్రమైన భావాలతో వుండాలి. కన్నులను ఇచ్చింది ఎందుకు? వారిని వీరిని చూడటానికా! కాదు. కైలాసవాసుని తిలకించడానికి. మంచి దృశ్యములను చూడటానికి మనకు భగవంతుడు కన్నులను ప్రసాదించాడు. కనుక పవిత్రమైన కన్నులను పవిత్రమైన పనులలో పెట్టాలి. ప్రకృతిలో మనం పుట్టాం. ప్రకృతి పరమాత్ముని అంగం. కాబట్టి ప్రకృతిలో పుట్టిన మనమందరం కూడా భగవంతుని అంశంలో చేరిపోవాలి. అట్టి భావాలను అభివృద్ధి పరచుకోండి. దూషణ భూషణ తిరస్కార, పురస్కారములన్నింటిని మంచిగానే భావించు కోండి. అన్నింటినీ ఆనందంగానే తీసుకోండి. దీనికి మించిన 'యోగం' మరొకటిలేదు. కనుక అలాంటి యోగమును నీవు పొందాలి.

పంచభూతముల యొక్క తత్త్వాన్ని చక్కగా విచారించి "ఆ పంచభూతములు నా యందు కూడా ఉంటున్నాయి. ఆ పంచభూతములను పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి. నా ఉచ్ఛ్వాస నిశ్వాసములను కూడ భగవత్ నామంలో ప్రవేశపెట్టాలి" అని భగవత్ నామాన్ని చింతించు.

*(ది. 15-5-2000 (సాయంత్రం) బృందావనంలో సాయి రమేష్ హాల్‌నందు వేసవి తరగతుల సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగం నుండి)*



ఓం శ్రీ సాయిరాం

# సాయి ప్రశాంత్ గెస్ట్‌హౌస్ & రిసార్ట్స్

3-466, గోపురం గేటు వద్ద,

పుట్టపర్తి - 515 134. అనంతపూర్ జిల్లా.

## 1. FAMILY ACCOMMODATION SCHEMES

ఎ రు. 15,000/-లు చెల్లించినవారికి, 15 సం॥ పాటు, ప్రతి సంవత్సరము 8 రోజులు డీలక్స్ గదులు ఉచితముగా యివ్వబడును. బ్యాంక్ గ్యారంటీ సర్టిఫికేట్‌తో, 15 సం॥ తరువాత రు. 7,500/-లు రిఫండ్ యివ్వబడును.

బి రు. 20,000లు చెల్లించినవారికి, 20 సం॥ల పాటు, ప్రతి సంవత్సరం 15 రోజులు డీలక్స్ గదులు ఉచితముగా యివ్వబడును. బ్యాంక్ గ్యారంటీ సర్టిఫికేట్‌తో, 20 సం॥ తరువాత రు. 10,000/-లు రిఫండ్ యివ్వబడును

## 2. ROOMS OWNERSHIP SCHEMES

ఎ. అదే బిల్డింగ్‌లో, రు. 2 లక్షలు రూపాయిలు కట్టి డీలక్స్ రూమును రిజిస్ట్రేషన్ ద్వారా స్వంతం చేసుకొని, ప్రతి సంవత్సరం 2నెలలు ఒకేసారిగాని లేక అప్పుడప్పుడుగాని డీలక్స్ రూములు ఉచితంగా వాడుకొనవచ్చును.

బి. ఆ డీలక్స్ రూములు మా మేనేజిమెంటుకే వప్పజెప్పవలెను. అయితే మిగిలిన 10 నెలలకు, మా నుండి రు.10 వేల రూపాయిల ఆదాయమును కూడా పొందవచ్చును.



**ప్రతి డీలక్స్ గది యందు DININGSET, TEA SET, MEALS CARRIER, HOT WATER, PHONE సౌకర్యములు కలుగజేయబడును.**

ఇతర వివరములకు



*Ch. Venkateswara Rao*, Proprietor,
SAI PRASANT GUEST HOUSE & RESORTS
PUTTAPARTHI - 515 134. Anat. Dist.



# గజానన్ మహరాజ్ (శేగాంవ్)

షిరిడీ సాయిబాబా ఎక్కడి నుంచి వచ్చారో, అంతకు ముందు ఎక్కడ వున్నారో ఏమీ తెలియదు. గజానన్ మహరాజ్ కూడా అలాగే 1878 ఫిబ్రవరి 23న అకస్మాత్తుగా మహారాష్ట్రలోని శేగాంవ్‌లో ప్రత్యక్షమయ్యారు. నాగపూర్ నుండి ముంబాయి వెళ్ళేదారిలో ఒక రైలు స్టేషన్ శేగాంవ్. ఆ కుగ్రామం ఆయన ధర్మమా అని ఈ రోజు అంతర్జాతీయ ఖ్యాతిని పొందింది.

ఆ రోజు శేగాంవ్‌లో దేవదాసు పాతూర్కర్ అనే గృహస్థుయింట ఏదో పూజజరిగి, అన్నదానం ఏర్పాటు అయింది. బ్రాహ్మణులు భోజనం చేసిన తర్వాత విస్తళ్ళు ఎత్తి వీధిలో పడవేశారు. విందుకు హాజరయి యిళ్ళకు తిరిగి వెళ్ళే వాళ్ళలో బంకట్‌లాల్ అగర్వాల్, దామోదర్ పంత్ కులకర్ణులు వున్నారు. ఆ ఎంగిలి విస్తళ్ళ వద్ద ఒక తేజస్వి అయిన యువకుడు కూచుని ఎంగిలి ఆకులలో మిగిలిన ఆహార పదార్థాలకై వెతుకులాడటం వాళ్ళు గమనించారు.

వాళ్ళు వెంటనే పాతూర్కర్ దగ్గరకు వెళ్ళి ఒక విస్తరి నిండా భోజనం పెట్టించుకొని తెచ్చి ఆతని ముందు పెట్టారు. అతడు మౌనంగా దానిని భుజించాడు. అయితే తినే పద్ధతి మాత్రం చూపరులకు కొత్తగా వుంది. అతడు విస్తరిలో వడ్డించిన వాటినన్నిటినీ కలిపివేసి, నిరాసక్తతతో తినటం వాళ్ళకు ఆశ్చర్యం కలిగించింది. ఈయన ఎవరో అవధూత అని వాళ్ళు గ్రహించారు.

'స్వామీ! మంచినీరు తెమ్మంటారా' అనడిగారువాళ్ళు. 'మీక్కావాలనుకుంటే తెండి. బ్రహ్మ అంతటా వున్నాడు. అయినా దేహానికి కొన్ని అవసరాలుంటాయి. భోజనం శేషా. కనుక నీళ్ళు కూడా తాగక తప్పదు', అన్నాడాయన.

వాళ్ళు నీళ్ళు తేవడానికై పాతూర్కర్ యింటికి పరిగెత్తారు. ఇంతలో ఆ యువకుడు అక్కడికి దగ్గరనేవున్న నూతి వద్ద పశువులకై వుంచిన గాబులో పశువులు తాగగా మిగిలిన నీళ్ళను తాగి తృప్తిగా త్రేన్చాడు. 'అయ్యో! స్వామీ! అది మురికినీరు. తాగకండి. ఇదిగో! మంచి తీర్థం' అన్నారువాళ్ళు. 'అన్నిటా వున్నది బ్రహ్మ. అపవిత్రం, పవిత్రం మీకు. ఆయనకు వర్తించవు. ఆయనను తెలుసుకునే ప్రయత్నం చేయండి. అంతా ఒకటేనని తెలుస్తుంది', అన్నాడా యువకుడు.

ఆ యువకుడు శేగాంవ్‌లో వుండిపోయాడు. ఆయన వూరేదో, పేరేదో ఎవరికీ తెలియదు. ఆయన ఎప్పుడూ 'గణగణ గణాంతబోతే' అని పాడుతూ భజన చేసేవారు. అందుకే అంతా ఆయనను గజానన్ మహరాజ్ అనసాగారు. అదే చివరకు స్థిరపడింది. అక్కల కోటలో కూడా మరొక గజానన్ మహరాజ్ వున్నారు. ఆయన భగవదవతారంగా పరిగణించబడేవారు. అందుకే ఈయనను గజానన్ మహరాజ్ (శేగాంవ్) అనటం పరిపాటి అయింది.

**భండారు పర్వతాలరావు**

గజానన్ మహరాజ్ ఎన్నో అద్భుతాలు చేసేవారు. కాశీ నుంచి ఒక సన్యాసి, ఆయనకు గంజాయి తాగే హుక్కా బహూకరించాలని వచ్చాడు. ఆయనను చూస్తూనే తన మనసులో మాట ఎలా చెప్పాలో తెలియక వ్యాకుల పడసాగాడు. చుట్టూ వందలాది జనం. అసలు మహరాజ్ దగ్గరకు చేరే వీలే లేకపోయింది. ఇంతలో గజానన్ మహరాజ్ 'కాశీ నుంచి నాకోసం ఒక సన్యాసి వచ్చి అక్కడనిలుచున్నాడు. నా దగ్గరకు తీసికొనిరండి' అన్నాడు.

సన్యాసి దగ్గరకురాగానే 'ఏదీ నీవు తెచ్చిన గంజాయి' అని అడిగి తీసికున్నాడు. గజానన్ మహరాజ్‌కు అంతవరకు గంజాయి అలవాటులేదు. ఆనాటి నుండి ఆ సన్యాసి యిచ్చిన గంజాయిని సేవిస్తుండేవారు. ఆయన నోట ఎప్పుడూ ఒక చిలుంగొట్టం వుండేది. ఆయన వేదం చదివితే వేద పండితులు ఆశ్చర్యపోయేవారు. భజన గీతాలు

పాడితే అద్భుతరాగ, భావయుక్తంగా వుండేది. సామాన్యంగా ఆయన దిగంబరంగా తిరిగేవారు. లేదా ఏదైనా గుడ్డనొకదానిని భుజంపై నుండి వేసుకొనేవారు. క్రమంగా మహరాజ్ కోసం ఒక మఠం ఏర్పాటయింది. అక్కడ నిత్యం అన్నదానం జరిగేది. పదార్థాలెలా వచ్చేవో ఎలా వండింది అందరికీ సరిపోయేదో - అదే ఒక అద్భుతం.

మహరాజ్‌కోసం వచ్చే వాళ్ళతో శేగాంవ్ ఎప్పుడూ సందడిగా వుండేది. ఆ కుగ్రామం మరో పండరీ పురమైంది. మహరాజ్ 1910 సెప్టెంబరు 8న శేగాంవ్‌లో సమాధి చెందారు. వారుండగానే శ్రీ గజానన్ మహరాజ్ సంస్థాన్ స్థాపించబడింది. ఇప్పుడు సంస్థానం వారు సమాధి దర్శనంకై వచ్చే యాత్రికులకు చక్కని వసతి సదుపాయాలు ఏర్పాటు చేశారు. భక్తులు సమర్పించే శాలువాలను, రవికెల గుడ్డలను, చీరలను, ధోవతులను సామాన్యంగా ఆయా ఆలయాలలో వేలం వేస్తారు. కాని శేగాంవ్ సంస్థానంలో అలా చేయరు. వాటిని తిరిగి భక్తులందరికీ ప్రసాదంలా పంచుతుంటారు. ఇలాంటి పద్ధతి బహుశా ఇక్కడ వొక్క చోటనే కనిపిస్తుందేమో!

మహరాజ్ ఇప్పటికే భక్తులు కోరిన కోర్కెలు తీరుస్తారని భక్తుల విశ్వాసం. ఎందరికో మహరాజ్ వలన దివ్యానుభవాలు కలిగాయి. కలుగుతున్నాయి. రోజూ సంస్థానానికి కనీసం వేయి మనీయార్డర్లు వస్తుంటాయి. శ్రీవారి గిడ్డంగి భక్తులు సమర్పించే ధాన్యంతో నిండి వుంటుంది. గోశాలలో ఎన్నో ఆవులు, గుర్రాలు, ఏనుగులు కూడా వున్నాయి. సంస్థానం వారు నిర్వహించే ఉద్యాన వాటిక మినీబృందావన్ గార్డెన్స్‌గా పేరుపొందింది.

సంస్థానంవారు పండరీలో కూడా మహరాజ్ మందిరాన్ని పాలరాతితో నిర్మించారు. శేగాంవ్‌లో ప్రస్తుతంవున్న మూడు భక్తనివాస్‌లు సరిపోక, కొత్తగా నాల్గవ భక్తనివాస్ ఏడు అంతస్థుల భవనాన్ని నిర్మిస్తున్నారు. ఇది దాదాపు పూర్తికావచ్చింది.

పుట్టపర్తిలోవలెనే స్వచ్ఛందంగా వచ్చి పనిచేసే కార్యకర్తలు వందల సంఖ్యలో వున్నారు. సొంత ఖర్చులపై వచ్చి, సేవచేసి వెళుతుంటారు. శ్రీవారి ప్రసాదాన్ని కోరిన వారికి రిజిస్టర్డ్ పార్సెల్‌లో పంపే ఏర్పాటుంది.

# పదాల పందిరి - 28

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | * | 2 | * | 3 | 4 |
| | * | 5 | | 6 | * | |
| 7 | | | * | 8 | | |
| * | * | | * | | * | * |
| 9 | | | * | 10 | | 11 |
| | * | 12 | 13 | | * | |
| 14 | | * | | * | 15 | |

## ఆధారాలు

**అడ్డం :**

1. అవినీతి కానిది
3. కష్టం
5. ఉత్సవం
7. నీటిలో ఉండే ఈ ప్రాణి పట్టుకుంటే వదలదు
8. విషం
9. చీకటి
10. సుకుమారం
12. పన్నీరు.... పుయ్యరుగా
14. ఇంగ్లీషులో చూస్తే!
15. కారాగారము

**నిలువు :**

1. నీటి నుండి జన్మించింది
2. 'చాలా' తమిళంలో
4. హంస
5. యుద్ధరంగం
6. స్టేజ్, ప్రదర్శనకు అనువైనది
9. నవ్వులు
11. ఒక వాద్యపరికరము
13. భూమి

- కిరీటి

## పదాల పందిరి -27 సమాధానాలు

అడ్డం : 1.. వనం 3. ఛంకె 5. మౌనిక 7. వేమన 8. లలాటం 9. సహరా 10. రక్కసి 12. టంకము 14. సంధ్య 15. రోగి

నిలువు : 1. వకుళే 2. శని 4. కెరటం 5. మౌనపోరాటం 6. కలవరము 9. సరసం 11. సివంగి 13. కల్తీ



# శుక్రవారం - శ్రీ మహాలక్ష్మి



"నమస్తే஽స్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే
శంఖ చక్ర గదా హస్తే మహాలక్ష్మీ నమోస్తుతే"

శుక్రవారం అనగానే అందరికి శ్రీ మహాలక్ష్మీదేవి గుర్తుకు వస్తుంది. ఎందుకనగా లక్ష్మీదేవికి శుక్రవారం ప్రీతికరమైన రోజుకాబట్టి. ఆమె శ్రీ మహాలక్ష్మి. ఆమె శ్రీ మహామాయ. ఆమె శ్రీ మహాసరస్వతి. ఆమె శ్రీ పీఠవాసిని. అయినప్పటికి ప్రతి శుక్రవారం లక్ష్మీదేవిని, శ్రావణ పూర్ణిమకు ముందు వచ్చే శుక్రవారం శ్రీ లక్ష్మీదేవిని వరలక్ష్మీగాను, నవరాత్రులలో ఒకరోజు శ్రీ మహాలక్ష్మిగాను పూజిస్తారు. అంతేకాక అష్టలక్ష్మిగా ఆ అమ్మను ఎనిమిది రూపములతో ధ్యానించి పూజిస్తారు. 1. ఆదిలక్ష్మి 2. ధాన్యలక్ష్మి 3. ధైర్యలక్ష్మి 4. గజలక్ష్మి 5. సంతానలక్ష్మి 6. విజయలక్ష్మి 7. విద్యాలక్ష్మి 8. ధనలక్ష్మి. ఏ పేరుతో పిలిచినా, ఏ రూపమును పూజించినా మంగళకరమైనవి, శుభప్రదమైనవి అన్నీ లక్ష్మీప్రదములే. శుక్రవారంనాడు లక్ష్మీ దేవినే పూజించాలా ఇంకే దేవినీ పూజించకూడదా? అని కొందరంటారు. కానీ లక్ష్మి అయిన, పార్వతి అయిన, సరస్వతి అయినా అంతటా నిండి ఉన్నది ఒకే శక్తి. దేశకాల పరిస్థితులను బట్టి ఆ తల్లి జగన్మాత ఒక్కొక్క అవతారంలో ఒక్కొక్క పేరుతో పిలువబడుతూ పూజింపబడుతూ ఉంటుంది. సామాన్యురాలైన ఒక్క స్త్రీనే అమ్మ! అక్క! అత్త! వదిన! చెల్లి! అని ఎన్నో వరుసలతో పిలుస్తుంటాము. ఇక ఆ జగజ్జనని సంగతి ఏమి చెప్పగలము?

**"సకుంకుమ విలేపనా మళికచుమ్బి కస్తూరికాం
సమన్దహసితేక్షణాం సశరచాప పాశాంకుశామ్,
అశేషజనమోహినీ మరుణమాల్యభూషోజ్వలాం
జపాకుసుమ భాసురాం జప విధౌస్మరే దుమ్బికామ్"**

శుక్రవారమునాడు శ్రీ చక్రంలో శ్రీ లలితా పరమేశ్వరిని సహస్ర నామములతో పూజించేవారు, కుంకుమతోను, శ్రీ గంధముతోను, మారేడు దళములతోను, ఆ అమ్మను అర్చించేవారు. ఈ జన్మలో సకల సంపదలను, సర్వాభీష్టములను, పుత్రపౌత్రాదులతో కూడిన సమస్త భోగములను, సకల శుభములను పొందుతారు. చివరకు శ్రీ లలితాసాయుజ్యమును పొందుతారనటంలో ఎట్టి సందేహములేదు" అని శాస్త్రములు, పురాణములు చెపుతున్నాయి. అందువలన శుక్రవారం సంతోషీమాతకు, శ్రీ లలితాదేవికీ ఇష్టమయిన రోజే.

సంతోషీమాతకు శుక్రవారం చాలా ముఖ్యమయిన రోజు. సంతోషీమాత వ్రతముచేసేవారు చాలా నియమ నిష్టలతో ఉండాలి. శుక్రవారంనాడు కోపం తెచ్చుకోకూడదు. పులుపు తినకూడదు. రోజంతా ఉపవాసం ఉండి పులుపు లేని ఫలహారం రాత్రిపూట తీసుకొని, మరునాడు మరల

**కొమరగిరి జయప్రద**

ఆ తల్లిని పూజించి భోజనం చేయాలి. శుక్రవారంనాడు ఎల్లప్పుడూ సంతోషం! సంతోషం! అంటూ ఉండాలి. ఈ విధంగా ఎన్ని శుక్రవారములు వ్రతము చేద్దామను కున్నారో అన్ని వారములు అలాగే నియమంగా ఉండాలి. అనుకున్నవి అయిన తరువాత ఉద్యాపనజేస్తే వ్రతము సమాప్తి అవుతుంది. అంతటి నమ్మకంతో, అత్యంత నియమనిష్టలతో ఆ దేవిని పూజిస్తే ఆ సంతోషీమాత ఎంతో సంతోషాన్ని, సంప్రీతిని పొందుతుంది. తనను కొలిచే వారికి కొంగుబంగారమై కోరిన కోరికలు తీర్చుతూ సర్వశుభాలనూ, సంతోషాలనూ వారికి అందిస్తుంది. వారి ఇంట వెంట జంట ఉండి కాపాడుతూ ఉంటుంది. కాబట్టి శుక్రవారం నాడు సర్వమంగళ స్వరూపిణి అయిన ఆ జగజ్జననిని పూజించి సకల శుభములను పొందుదాము.

**చందాదారులకు మనవి**

**చందా పంపేటప్పుడు తమది క్రొత్త చందా? లేక పాత చందా? వివరంగా తెలియపరచండి. పాతచందా అయితే చందా నెంబరు తెలియజేయండి. M.O. కూపన్ మీద తమ చిరునామాను వివరంగా వ్రాయండి. అశ్రద్ధ చేయకండి.**

# ధర్మ దేవతా స్వరూపుడవు కావాలి

"సకల విద్యలు నేర్చి సభ జయించగవచ్చు
శూరుడై జగమందు పోరవచ్చు
రాజరాజైపుట్టి రాజ్యమేలగవచ్చు
హేమ గోదానంబు లియ్యవచ్చు
గగనమందున్న చుక్కలు నెంచగావచ్చు
జీవరాసులపేర్లు జెప్పవచ్చు
అష్టాంగ విద్యలన్ని అభ్యసించగవచ్చు
చంద్రమండలమైన చేరవచ్చు
కాని, దేహేంద్రియములనరిగట్టి,
మనసునిలిపి, అంతర్ముఖముచేసి
అనవరతము నిశ్చల మానవతా విలువలు
నిలుపలేరు......................."

విద్యార్థులారా!

ఈనాడు ప్రపంచమునకు కావల్సినటువంటిది ధన కనకవస్తు వాహనాదులు కాదు. గుణవంతులైన విద్యార్థి, విద్యార్థినులు అత్యవసరము. దేశమంతయూ వారిపైననే ఆధారపడివుంటున్నది. ఇదియే నిజమైన భారతీయ సంస్కృతి యొక్క లక్ష్యము. కాలంతో మారని, ఏ సత్యమైతే వున్నదో, ఆ సత్యమునకు రూపకల్పనే భారతీయ సంస్కృతి. ఆ భారతీయ సంస్కృతి యొక్క అంతః స్వరూపమే సనాతన ధర్మం. ఈ మానవతా విలువల యందు భారతీయ సంస్కృతి నఖ, శిఖ, పర్యంతమూ సంచరిస్తూనే ఉన్నది. భారతదేశములోని వీచేగాలియందు ధర్మం చేరి ఉన్నది. భారతదేశంలోని ధూళియందు సత్యం చేరి ఉంది. దుమ్మియందు కరుణ ఉన్నది. గంగయందు ప్రేమ ప్రవహిస్తున్నది. భారతీయ మానవునియందు 'క్షమ' సంపూర్ణంగా ఉంది. ఇట్టి పవిత్రమైన గుణములను, అనాది కాలము నుండి భారతదేశం పోషిస్తూ వస్తున్నది. కనుకనే మన మహర్షులు 'త్యాగము' నీకు పట్టాభిషేకం చేశారు. వ్యక్తులకుకాదు, నిజమైనటువంటి శక్తి. అదియే త్యాగము. అట్టి త్యాగమునకు పట్టాభిషేకం చేశారు. ధర్మమును అందలం ఎక్కించారు. న్యాయమునకు పట్టం కట్టారు. సత్యానికి స్వాగతం పలికారు. ప్రాచీన ఋషుల ప్రభావం అనేక విధముల, అనాది కాలము నుండి సంరక్షిస్తూ వచ్చింది. కాని దురదృష్టవశాత్తు, కాలం మారిన కొలదీ మానవుల యొక్క మనసులు మారిపోతున్నాయి. కాలకర్మ కారణ కర్తవ్యాలను గుర్తించుకోలేనివారుగా ఈనాడు తయారవుతున్నారు. కనుకనే ఈనాటి మానవుడు గుర్తించవలసినది భారతీయ సంస్కృతిని. ఇది ఒక్క భారతదేశమునేకాదు, యావత్ ప్రపంచానికి ఈ సంస్కృతి మూలాధారమైనటువంటిది. కనుక ఈ సత్య, ధర్మ, శాంతి,

## భగవాన్ సాయి దివ్యబోధ

ప్రేమలనేటటువంటి మానవతా విలువలు యావత్ ప్రపంచమునకే సమానమైనటువంటివి. ప్రపంచమునకే ప్రాణాధారమైనటువంటివి. అట్టి పవిత్రమైన మానవతా విలువలను భారతీయులు అభివృద్ధి పరచుకొనలేక, వాటిని క్రమక్రమేణా కోల్పోతున్నారు.

విద్యార్థులారా! విద్యార్థినులారా!

రేపటి భారత పౌరులుమీరే. మీ ద్వారానే ఈ ప్రాచీన సంస్కృతిని నిలబెట్టటానికి వీలవుతుంది. ఈనాడు దేశంలో అసత్య అన్యాయ అక్రమ అనాచారములు తాండవ మాడుతున్నాయి. ఇట్టి సమయమందు శాంతస్వరూపులై, పవిత్రభావులై, ఆచరణశక్తులై, ఈ అనాచారములను పారద్రోలుటకు కంకణం కట్టుకోవలసినవారు విద్యార్థులే. కనుకనే ఈనాటి భారతీయ విద్యార్థినీ విద్యార్థులు తగిన సద్గుణములను పెంచుకొని, ప్రజలకు ఆనందజీవితాన్ని అందించే నిమిత్తమై తగిన కృషిచేయాలి. మానవతా విలువలు ప్రత్యేకంగా పుట్టలేదు. మానవునితోపాటే మానవతా విలువలు కూడా జన్మించాయి. వీటిని ప్రత్యేకంగా విచారణ చేయనవసరంలేదు. వీటికోసం ప్రత్యేకంగా వెదుకనవసరంలేదు. నీయందే, నీతోనే, నీ వెంటనే ఈ విలువలు వెంటాడుతూ వచ్చినాయి. అయితే

## విదేశాలలో భారతీయ నాటకములు

భారతీయ నాటకాలు ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షిస్తున్నాయి. ముఖ్యంగా శాకుంతలం, రామాయణ, మహాభారత నాటకాలు విశేషమైన ఆదరాన్ని పొందుతున్నాయి. గ్రీసు దేశపు నాటక సమాజం ఒకటి 1985 సం॥లో కాళిదాస జయంతి సందర్భంగా ఉజ్జయినీ వచ్చి 'శాకుంతలం' నాటకాన్ని ప్రదర్శించి మెప్పు పొందింది. పీటర్ బ్రూస్ నేతృత్వంలో వివిధ దేశాలలో మహాభారత యుద్ధ నాటకం ప్రదర్శించబడి మెప్పును పొందినది. జిన్‌క్లాడ్ కారియర్ ఆంగ్లంలో ఈ నాటకమును తయారు చేశాడు. ఈ నాటకం ప్రదర్శించడానికి గం॥ 9-00 లు పడుతుందట. ఈ నాటకం తయారు చేయడానికి తొమ్మిది సంవత్సరాల కాలం పట్టిందట. 1986 ఏప్రియల్ నుండి రెండు సంవత్సరాలకు పైగా గ్లాస్కో (స్కాట్లాండ్) నగరంలో దీనిని ప్రదర్శించారు. 1988 మే నెలాఖరు నుంచి దీని రంగస్థలం టోక్యోకు మారింది. జ్యూరిచ్, లాస్ ఏంజల్స్, న్యూయార్క్, పారిస్ నగరాలలో కూడా ఈ నాటకం ప్రదర్శించబడింది. ఈ నాటకంలో పాత్రధారులు వివిధ దేశాలకు చెందిన వారు కావటం విశేషం. అర్జునుడు ఇటలీ, ధర్మరాజు జర్మనీ, ద్రోణుడు జపాన్, పాండురాజు ఇండోనేషియా, కర్ణుడు ట్రినిడాడ్ లకు చెందినవారు. నటీనట వర్గంలో ఏకైక భారతీయ ప్రతినిధి మల్లికా సారాభాయ్ మాత్రమే.

**(సమర్థ సద్గురు నుండి)**

తన యందే వున్నటువంటి ఈ గుణాలను గుర్తించుకోలేక పోతున్నాడు మానవుడు. కనుక మొట్టమొదట మన యందున్నటువంటి సత్య ధర్మాలను ప్రేమించాలి. **"సత్యం వద - ధర్మం చర"**. ఇదియే మన భారతీయ సంస్కృతి. సత్య ధర్మములే మానవుని యొక్క ప్రధానమైన విలువలు.

"సత్య ధర్మ శాంతి ప్రేమలు లేకున్న
విద్యలెన్నియు నేర్చి విలువసున్న
సత్య ధర్మ శాంతి ప్రేమలు లేకున్న
దాన ధర్మాల సార్థకత సున్న
సత్య ధర్మ శాంతి ప్రేమలు లేకున్న
పదవులనేలిన ఫలముసున్న
సత్య ధర్మ శాంతి ప్రేమలు లేకున్న
బహుళ సత్కార్యలాభంబుసున్న
ఈ సనాతన ధర్మ హర్మ్యంబు నిల్వ
గుణములివి నాలుగు పునాది గోడలప్ప
ఇంతకన్నను వేరెద్ది ఎఱుక పరతు
సాధుసద్గుణ గణ్యులౌ విద్యార్థులారా!"

**విద్యార్థులారా!**

ప్రాణ సమానమైనటువంటి ఈ గుణములను ఎటువంటి పరిస్థితులలోను విసర్జించగూడదు. భౌతిక, లౌకిక, ప్రాకృతమైన గుణముల కోసం మీరు ప్రాకులాడ కూడదు. ఎంతటి శక్తివంతులైనప్పటికినీ, ప్రాకృతంలో ప్రవేశించినప్పుడు, వారు అధోగతిని పొందుతున్నారు. రావణుడు మహాశక్తివంతుడు. అతనికున్న శక్తి ఇతరుల కెవరికీలేదు. సిరిసంపదలతో తులతూగుతూ వచ్చాడు. భోగభాగ్యములలో మునిగితేలుతూ వచ్చాడు. అతనికి ఎట్టి కొరతా లేదు. గొప్ప విద్వాంసుడు. అన్ని విద్యలూ నేర్చాడు. ఇంతటి శక్తి వుండికూడనూ, కట్టకడపటికి ఒక్క చెడు గుణానికి, కామానికి లోబడిపోయాడు. కనుకనే సర్వమునూ కోల్పోయాడు. తన వంశాన్నే నాశనం గావించుకున్నాడు.

ఇక రెండవవాడు 'హిరణ్యాకశిపుడు'. గొప్ప సైంటిస్టు. ఈనాటి సైంటిస్టులు చంద్రమండలం పోయి వచ్చామంటున్నారు. హిరణ్యకశిపుని శక్తిలో ఇది చాలా చిన్నది. హిరణ్యాకశిపుడు నక్షత్రమండలాలకు కూడా చేరాడు. నక్షత్రమండలంలో ప్రవేశించి, ఒక నక్షత్రము వంచడానికి ప్రయత్నం చేశాడు. అప్పుడే భూమంతా కదిలి పోయింది. మహర్షులందరూ ప్రార్థించారు. వెనుకకు రావాలని ఆయనను అర్థించారు. ఇంతటి సామర్థ్యము, ఇంతటి మహాశక్తి సంపన్నుడైన హిరణ్యకశిపుడు హరిని ద్వేషిస్తూ వచ్చాడు. అదియే ద్వేషము, అదియే క్రోధము. చిట్టచివరికి ఈ 'క్రోధం' ఏమి చేసింది?

"తన కలిమి భంగ పుచ్చెను
తనకును తన గౌరవమును దగ్ధం చేసెను
తనవారల వెడచేసెను
గర్వంబు వలన క్రోధంబువలన
సర్వము చెడి యెను
క్రోధము గలిగన వానికి ఏ పనియు ఫలింపకుండు
ఎగ్గులు కలుగున్ పాపపుపనులను చేయును
ఛీ! పొమ్మనిపించుకొనును"

ఇట్టి క్రోధమును హిరణ్యకశిపుడు అభివృద్ధి చేసుకున్నాడు.

ఇంక 'దుర్యోధనుడు'. పైవాడి తమ్ముడే. తనది కాని రాజ్యమును అక్రమంగా అపహరించి, అసలు ఆ రాజ్యమునకు అర్హులైన పాండవులను వనవాసానికి పంపించాడు. ఇది ఏ గుణంచేత? లోభం చేత. కామక్రోధ లోభములు మూడు కూడా మానవునికి మహా శత్రువులు. ఈ లోభంచేతనే దుర్యోధనుడు సర్వనాశనమైనాడు. యావత్ తన వంశాన్నే సర్వనాశనం గావించుకున్నాడు.

ఆనాడు ఒక్కొక్కరియందు ఒక్క చెడుమాత్రమే ఉండేది. రావణాసురునిలో కామం, హిరణ్యకశిపునిలో క్రోధం, దుర్యోధనునిలో లోభం ఉండేది. ఆ ఒక్క చెడు గుణమే వారలను నాశనం చేసింది. కాని ఈనాటి కలియుగ మానవునియందు, ఈ మూడు గుణములూ ఒక్కొక్కని యందుంటున్నాయి. ఒక్క చెడుగుణం ఉన్నప్పుడే వారు అంత పతనమైపోయారు. ఇంక ఈ మూడు చెడుగుణములూ చేర్చుకున్న ఈనాటి మానవునికి ఏ గతి పట్టుతుందో! చెప్పలేం. కనుకనే ఈనాటి విద్యార్థినీ, విద్యార్థులు ఈ కామక్రోధలోభములను కొంత పరిమితములో ఉంచుకోవాలి. పూర్తిగా లేకుండా చేసుకొనటం సాధ్యం కాదు. ఏ మహనీయులకో ఈ పవిత్ర ప్రాప్తి చెందుతుంది. ఆ గుణములు వస్తాయి, అందరిలో ప్రవేశిస్తాయి. కాని వాటిని తక్షణమే అరికట్టడానికి ప్రయత్నించాలి. అప్పుడే నీవు సరియైన వ్యక్తిగా దేశోద్ధారకునిగా తయారవుతావు.

అయితే ఈనాడు దురదృష్టవశాత్తు ఇంటి వద్ద తల్లిదండ్రులుగాని, విద్యాలయాలలో అధ్యాపకులుగాని, దేశంలో నాయకులుగాని, ఇలాంటి బోధనలు చేయక పోవడంవలననే, ఈనాటి విద్యార్థులు ఈ విధంగా పతనమై పోతున్నారు. విద్యార్థులు నిర్మల నిశ్చల నిస్వార్థపరులు. విద్యార్థులు సహజంగా చాలా మంచివారు. కాని వారిలో ఆవిర్భవించేటటువంటి దుర్గుణములు అంతా తల్లిదండ్రుల నుంచి ప్రారంభమవుతున్నాయి. తరువాత విద్యాలయాలలో అవి పెరిగిపోతున్నాయి. రాజకీయములు సర్వమునూ నాశనం చేస్తున్నాయి. ఈనాడు దేశమును నాశనం చేసేది రాజకీయములే. తాము చేయరు, ఇతరులను చేయనివ్వరు. పవిత్రమైన భావములను అరికట్టి, దుర్మార్గమైన భావములు పెరిగిపోవటానికి, ఈ రాజకీయములే మూలకారణం. కనుక మీరు ఏ పార్టీలోనూ చేరకండి. దేశకళ్యాణ నిమిత్తమై, దేశసంక్షేమ నిమిత్తమై మీ జీవితాలను అంకితం చేయండి. ఏదైనా సరే, సేవలలో పాల్గొనండి. సేవకు మించినది మరొకటిలేదు.

విద్యార్థులారా! ప్రాచీన విద్యాసంస్థలు ఎంతో పవిత్రంగా ఉండేటటువంటివి. ఆనాడు అందరూ లోక హితమును కోరేటటువంటివారు. అందరూ మంచి గుణములతో ఉండాలని ఆశించేటటువంటి వారు. అందరూ విజ్ఞానవంతులు కావాలని కోరుకునేటటువంటివారు. కనుక ఈనాడు జ్ఞానంతో మన హృదయాన్ని పెంచుకోవాలి. సేవలతో మన దేహాన్ని పవిత్రం గావించుకోవాలి. పవిత్రమైన దేహము, పరిశుద్ధమైన హృదయము, స్వచ్ఛమైన వాక్కు - ఈ మూడింటి యొక్క సమ్మిళితమే మానవ స్వరూపము. హృదయము, వాక్కు, చేతులు - ఈ మూడింటి యొక్క ఏకత్వం కావాలి. హృదయంలో ఆవిర్భవించినటువంటి సత్యమును నీవు చెప్పాలి. చెప్పిన సత్యమును చేతితో చేయాలి. నీ దేహమే ఒక బిళ్వము. నీ మనసే ఒక పత్రము, నీ హృదయమే ఒక ఫలము, నీ ఆనందతోయమే ఈ జలము. కనుక నీవు ఆనంద భాష్పములనే రాల్చాలిగాని, శోకధారలు కార్చకూడదు. అభిమానమమకారములచేతనే ఈ శోకం వస్తుంది. కనుక ఈ శోకంలో మనం ఏమాత్రం ప్రవేశించకూడదు. నిరంతరం ఆనందం... ఆనందం.... ఈ ఆనందం ఎక్కడ ఉన్నది? Happiness is Union with God. దైవంతో కూడి


పురాణపండ శ్రీ చిత్రగారిచేత ఈ క్రింది పుస్తకములు రచించబడినాయి. కావలసినవారు ఈ క్రింది చిరునామావారితో సంప్రదించవచ్చును.

| | |
|---|---|
| **1. ఋషుల చరిత్రలు** | **- రు. 30-00** |
| **2. సంపూర్ణ రామాయణం** | **- రు. 42-00** |
| **3. స్త్రీల నోములు - వ్రతములు** | **- రు. 22-00** |
| **4. దివ్యస్తోత్ర రత్నావళి** | **- రు. 9-00** |
| **5. చాణక్య నీతి** | **- రు. 6-00** |

**వివరములకు :**

**పురాణపండ శ్రీ చిత్ర**

**ఆలమూరు - 533 233. తూ.గో. జిల్లా.**

# ధర్మవ్యాధోపాఖ్యానము

"గురు శుశ్రూషణం సత్యం
అక్రోధో దానమేవచ
ఏ తచ్చతుష్టయం బ్రహ్మన్
శిష్టాచారేషు నిత్యదా"

'ఓ బ్రాహ్మణా! గురువులను సేవించడం, సత్యమే మాట్లాడటం, కోపం లేకుండటం, దానం చేయటం - ఈ నాలుగు సద్గుణాలు శిష్టాచారవంతులైన ఉత్తముల్లో ఎల్లప్పుడూ ఉంటాయి.

వున్నప్పుడే మనకు ఎట్టి బాధలూ వుండవు. ఆహార విహారములచేతగాని, సంబంధ బాంధవ్యములచేతగాని, సంపర్కములచేతగాని కొన్ని దుఃఖములు వస్తుంటాయి. వీటిని మనం లక్ష్యపెట్టకూడదు. ఇవన్నీ వచ్చిపోయే మేఘముల వంటివి. వీటికి నీ హృదయాన్ని ఏమాత్రం అంకితం చేయవద్దు. నీ హృదయాన్ని ఎప్పుడూ సాక్షీభూతంగా పెట్టుకో. నీకర్మలను నీవు ఆచరించు. తల్లిదండ్రుల నుంచి వచ్చే మంచి సలహాలను తీసుకోండి. తల్లిదండ్రులను గురువులుగా భావించుకోండి. ఆ తల్లిదండ్రులను దేవతలుగా భావించండి. కనుకనే ప్రాచీన కాలం ఋషులు **'మాతృదేవోభవ! పితృదేవోభవ! ఆచార్య దేవోభవ! అతిథి దేవోభవ!'** అని బోధించారు. అసలు ప్రపంచంలో దేవుడు (God) కానటువంటివాడు లేనేలేడు. **మీరంతా Good Boys గా తయారవుతే అప్పుడు మీరే God Boys అవుతారు. కనుక మొట్టమొదట Good Boys కాండి!** హృదయం దివ్యభావములతో నింపుకోండి. దివ్యభావములే శూన్యమైపోతే, మన జీవితమే శూన్యమై పోతుంది.

ఈనాడు మానవతా విలువలను కోల్పోవటంచేతనే, ప్రపంచంలో ఆధ్యాత్మికం మంట కలసిపోయింది. ఎప్పుడు ఆధ్యాత్మికత మంటకలసిపోయిందో, నైతిక ప్రవర్తన అనేది కూలిపోయింది. నైతిక ప్రవర్తన ఎప్పుడు కూలిపోయిందో, పవిత్రమైన ధర్మం అడుగంటిపోయింది. ఎప్పుడు ఈ ధర్మం అడుగంటి పోయిందో, ఆదర్శప్రాయమైనటువంటి జీవితం అదృశ్యమైపోయింది. కనుక మొట్టమొదట మనం మానవతా విలువలను పెంచుకోవాలి. అప్పుడే దేశంలో ఆధ్యాత్మికం ఆవిర్భవిస్తుంది. ఆధ్యాత్మికం ఎప్పుడు ఆవిర్భవించిందో, అప్పుడే నైతిక జీవితం ప్రారంభమవుతుంది నైతిక జీవితం ఎప్పుడు ప్రారంభమైందో - అదియే ధర్మస్థాపన. ఈ ధర్మమునకు ఎప్పుడు పునాది భద్రమవుతుందో, అప్పుడే ఆదర్శ జీవితాలు ఆవిర్భవిస్తాయి.

**విద్యార్థులారా!**

మీరు ఆదర్శజీవులుగా తయారుకావాలి. అట్టి ఆదర్శజీవులుగా తయారుకావాలనుకుంటే, ధర్మములో ప్రవేశించాలి. కాబట్టి ఏది ధర్మం? ఏది అధర్మం? చక్కగా విచారించాలి. నైతిక విలువలే ధర్మమునకు మూలం. **'ధారయతీతిధర్మః'**. దైవత్వాన్ని గురించి నీవు ఎప్పుడు చింతిస్తావో, అప్పుడు నీలో ధర్మం ఆవిర్భవిస్తుంది. కాల్చేటటువంటి శక్తి నిప్పుకు ఉంది. ఈ దహన శక్తే నిప్పుకు లేకపోతే, అది నిప్పేకాదు. 'ఐస్'కు గుణం చల్లదనం. చల్లదనమే లేకపోతే, అది ఐసేకాదు. అదేవిధముగ, 'సత్యమే' మానవుని గుణం. అయితే ఈనాడు ఆ సత్యమనేది ఎక్కడా కనిపించటంలేదు. దాని వలననే శాంతి భద్రతలు ప్రపంచంలో నాశనమైపోయినాయి.

**"సత్యం నాస్తి పరోధర్మః"** సత్యమే లేకపోతే ధర్మమే లేదు. కనుకనే ఆనాడు సత్య హరిశ్చంద్రుడు ఎన్నికష్టములకైనా తట్టుకొని, నెట్టుకొని తాను ముందుకు సాగుతూ వచ్చాడు. సత్యాన్ని సాధించాడు. అయితే ఈనాడు సత్యమునుసరిస్తే కష్టాలు వస్తాయేమోనని, ఎక్కడ ఉద్యోగం పోతుందోనని ఏడుస్తుంటారు. పోతే పోతుంది. ఈ తుచ్ఛమైన ఉద్యోగాల కోసం సత్యమును విడనాడుతారా? **నీవు ఆశించవలసినది 'యోగము' కాని 'ఉద్యోగం' కాదు.** ఈ ఉద్యోగము ఏదైనా మనం సాధించవచ్చును. కాని సత్యాన్ని మాత్రం సాధించటం కష్టం. ఈనాడు మానవుడు ప్రతి దానికి డబ్బు, ఉద్యోగం.... డబ్బు, ఉద్యోగం.... **ధనానికి దాసుడై పోతున్నాడు. ఉద్యోగానికి Servant (సేవకుడు) అయిపోతున్నాడు. ఇదో జీవితం? కాదు.. కాదు.. సత్యానికి Servant కావాలి. ధర్మానికి Leader (నాయకుడు) కావాలి. ధర్మ దేవతా పుత్రుడవు కావాలి.**

విద్యార్థులారా! సత్యమార్గంలో ప్రవేశించండి. ధర్మాన్ని మనస్సులో ప్రతిష్ఠ చేసుకోండి. అప్పుడే మీ యందు శాంతి చేకూరుతుంది. పవిత్రమైన భారతీయ

సంస్కృతిని ఈనాటి విద్యార్థుల హృదయాలలో చేర్చాలి. 'సంస్కృతి' అనగా ఏమిటి? **సంస్కృతి భాష కాదు. సంస్కరించబడినది సంస్కృతి.** కనుక మీరు సంస్కరించ బడిన విద్యార్థులుగా తయారుకావాలి. భారతీయ సంస్కృతి ఎంతో పవిత్రమైనటువంటిది. అనాది కాలం నుండి, ఆధ్యాత్మిక తత్త్వ ప్రభావంచేత, అన్ని దేశములకు కూడనూ సుస్థిరమైనటువంటి శాంతి భద్రతలను అందిస్తూ వచ్చింది ఈ భారతదేశము.

ఈనాడు ఇతర దేశములే బాగుపడుతున్నాయి. ఏ దేశంలో సత్య ధర్మములు ఆవిర్భవించెనో, ఆ దేశమే అడుగున పడిపోతున్నది. ఇది చాలా అవమానము. భారతదేశము యొక్క గౌరవాన్ని మనం కాపాడుకోవాలి. 'ఇది నా భారతదేశము' అని గర్వించడానికి తగిన శక్తిని మీరు సముపార్జించాలి. భారతదేశ గౌరవాన్ని ప్రపంచానికి చాటాలి. అన్నిటికన్నా ప్రధానమైనటువంటిది **ఆధ్యాత్మిక శక్తియే. ఆధ్యాత్మిక శక్తికి ఆచరణ ధర్మమే. ఆచరణ ధర్మానికి అనుష్ఠానము సత్యమే. ఈ మూడింటి యొక్క ఏకత్వమే భారతీయ సంస్కృతి.**

**ప్రేమస్వరూపులారా!**

నిన్నటి దినం అధ్యాపకులు పరీక్ష పెట్టారు చాలా కఠినమైన ప్రశ్నలు యిచ్చారు. అలాంటి పరీక్షలో అందరూ ఉత్తీర్ణులైనారు. 90 శాతం మార్కులకు తక్కువ వచ్చిన వారెవరూ లేరు. ఇంకా ఎక్కువే వచ్చాయి. ఇద్దరు మాత్రం నూటికి నూరు మార్కులు తెచ్చుకున్నారు. ఇలాంటి విద్యార్థులు దేశంలో ఎక్కడా కానరారు. సత్యసాయి విద్యా సంస్థలలోవున్న క్రమశిక్షణ ప్రపంచంలో ఏ సంస్థ యందూ కానరాదు. విదేశాలలో కూడా సత్యసాయి సంస్థలకు మంచి పేరు ఉన్నది. దీనిని నిలబెట్టాలి. మీ ప్రవర్తన ఆదర్శంగా వుండాలి. చూపులు చాలా పవిత్ర మైనవిగా వుండాలి.

"కన్నులందెప్పుడు కారుణ్య దృష్టియే
పలుకులెప్పుడు సత్యమొలుకుచుండు
తనుమోము యందున సమ్మృతభావమే"

ఎప్పుడూ ఆనందంగా ఉంటుండాలి. ఎలాంటి పరిస్థితులయందున విద్యార్థులు ఆముదం త్రాగిన ముఖం పెట్టకూడదు. ఎప్పుడూ నవ్వుతూ... నవ్వుతూ... నవ్వుతూ ఉండాలి. అదియే వుండవలసిన మంచి చిహ్నం. ముమ్ముందు మీరు ఉన్నత విద్యలకు వెళ్ళుతున్నారు ఎక్కడికైనా పోండి. మీ సద్గుణములు మాత్రం కాపాడు కోండి. మీ పవిత్ర ప్రవర్తనలను నిలబెట్టుకోండి. ఇదియే నేను ఆశించేది. మీ నుంచి నేను నయాపైసా తీసుకోవటం లేదు. అంతా ఉచితం... ఉచితం... ఈ 'ఉచితము' అనే పదమును కూడా నేను ఉపయోగించకూడదు. మీరు నావారు, నేను మీ వాడను. నా పిల్లలకు నేనే ఉచితంగా యివ్వాలి, యిస్తున్నాను. కనుక ఈ రెండింటి యొక్క ఏకత్వంగా మీరు భావించండి. నన్ను అడగటానికి మీకు హక్కు (Right) ఉన్నది. హక్కుగా అడగండి. కాని ప్రాధేయపడకండి. **'ఈశ్వరస్సర్వభూతానామ్'** అన్ని భూతములయందున్నటువంటిది భగవంతుడు ఒక్కడే. కాబట్టి నీయందూ, నాయందూ వున్నటువంటిది ఒకే తత్త్వము. ఆ తత్త్వాన్ని చక్కగా గుర్తించడానికి ప్రయత్నించండి. దానిని ఆచరణలో పెట్టటానికి తగిన సాధనలు చేయండి. అంతేచాలు. ఏ పూజలూ, ఏ పురస్కారములు చేయకపోయినా ఫరవాలేదు. హృదయం లో పవిత్రమైన భావాలను నింపుకుంటే చాలు. అంతకన్నా పవిత్రమైనది మరొకటి లేదు. ఒక్కొక్క విద్యార్థి సంవత్సరానికి పదిమందినైనా మంచివారిగా తయారుచేయాలి.

విద్యార్థులారా! నైతిక, ఆధ్యాత్మికతల యందు అభివృద్ధిని గాంచినప్పుడు, అన్ని రంగాలలో మనం అభివృద్ధిని పొందుతాం. ధనం తక్కువగా ఉన్నదని ఏ మాత్రం విచారించకండి. ఏ ధనం? భౌతిక సంపదలు కావు. దైవ ప్రేమయే పెద్ద ధనం. ఆ ధనమును మీరు పెంచుకోవాలి. కనుక ప్రేమతత్త్వాన్ని మీరు అభివృద్ధి పరచుకోండి. ఉన్నత విద్యలనభ్యసించండి. ఉన్నత పదవులు పొందండి. ఆ పదవులలో కూడా సర్వులకు



**భగవాన్ సాయి**

**వేసవి తరగతుల దివ్యోపన్యాసము**

మే 2000 సం॥లో బృందావనంలో జరిగిన వేసవి తరగతులలో భగవాన్ సాయి యిచ్చిన దివ్యోపన్యాసాలు జూన్ సంచిక నుండి పాఠకులకు అందిస్తున్నాం. ప్రతి నెలా రెండు లేక మూడు ప్రసంగాలు పాఠకులకు అందించబడుతాయి. కనుక త్వరపడండి! శ్రీవాణిని స్వంతం చేసుకోండి! భగవాన్ సాయి దివ్యోపన్యాసాలను చదవండి! చదివించండి! వినిపించండి! తరించండి. - **సం.**

సహాయం చేయండి. Help Ever, Hurt Never ఎవరికైనా సరే మీరు సహాయం చేయండి. తన పర బేధములను పెట్టుకోకండి. అందరూ నావారే అని భావించుకోండి. ఈ ఏకత్వమును పెట్టుకున్నప్పుడే, విశ్వ కుటుంబంగా తయారవుతుంది. ఈ భావములను అభివృద్ధి పరచుకోండి.

మీరు ఏ దేశం వెళ్ళినా, ఏ కాలమునందైనా, ఏ పరిస్థితులయందైనా, విద్యాసమయమునందు నేర్చుకొనిన వినయాన్ని అక్కడ ప్రకటించాలి. దానిని అక్కడ ఉపయోగపెట్టినప్పుడే మీరు ఆదర్శ విద్యార్థులుగా రూపొందుతారు. సత్యసాయి విద్యా సంస్థలలో చదివిన విద్యార్థులు ఈ విధంగా వున్నప్పుడే నాకు 'గొప్ప కీర్తి'. నేను మీ వద్దనుండి ఏమీ ఆశించటంలేదు. మీరు Good Name ను తెచ్చుకోవాలనేదే నా తాపత్రయం. అదే నాకు కావాలి. నా కోసం మీరు ఏమీ పాటుపడనవసరంలేదు. మీ కోసం ఏమైనా సరే నేను పాటుపడుతాను. మీరు మాత్రం మంచిపేరును తెప్పించుకోండి. దేశమునకు మంచి నాయకులుగా తయారుకాండి. అప్పుడే ప్రాచీన సంస్కృతిని పునరుద్ధరింపజేయడానికి వీలవుతుంది. సర్వ జీవ ప్రేమను పెంచుకోండి. సర్వదేశములయందున్న సమగ్రతను మీరు పాటించండి. ఏ దేశ సంస్కృతిని మీరు తిరస్కరించకండి. నీ తల్లి నీకు ఎంత ప్రేమయో, వారి సంస్కృతి అనే తల్లి మీద వారికి అంత ప్రేమ వుంటుంది.

'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి'. మన కన్నతల్లి, మనం పుట్టిన దేశము స్వర్గము కంటే మిన్న. ఈ రెండింటినీ నిరంతరమూ గౌరవించుతూరాండి. ఈ విధంగా మీ జీవితాలను గడుపుతూ వస్తే, మీరెంతనో ఆదర్శవంతులైన మహనీయులుగా రూపొందుతారు. 'మహనీయులు' అంటే కేవలం ఒక డ్రస్ వేసుకున్నటు వంటివారుకాదు. 'పైన కాషాయం, లోపల కషాయం'. అదికాదు. మంచి డ్రస్సు వేసుకోండి. మనసును మార్చుకోండి. మనుషులు మారితే ప్రయోజనం లేదు, డ్రస్సులు మార్చుకుంటే ప్రయోజనంలేదు. గుణములను మార్చుకోవాలి. సద్గుణములచేత మీ జీవితాలను సార్థకం చేసుకుంటారని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ, నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

*(ది. 30-5-2000న బృందావనం (బెంగుళూరు)లో 'వేసవి తరగతులు' ముగింపు సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*



సుభాషితవాణి

## ధనం దానధర్మాలకు వినియోగించాలి

"అదాన దోషే భవేద్దరిద్రో
దారిద్ర్య దోషేణ కరోతి పాపమ్
పాపాదవశ్యం నరకం ప్రయాతి
పునర్దరిద్రః పునరేవ పాపీ"

పూర్వ జన్మలో ఎవరికీ దానం చేయకపోవడం వలన ఈ జన్మలో దరిద్రులుగా పుడుతారు. దారిద్ర్య బాధవలన అనేక పాపపు పనులు చేయవలసి వస్తుంది. అలా పాపాలు చేయడం వలన నరకం ప్రాప్తిస్తుంది. ఆ నరకంలో కొన్నాళ్ళుండి మళ్ళీ దరిద్రులుగా పుట్టటం జరుగుతుంది. కాబట్టి తనకు ఉన్నదానిలో కొంత దానం చేయాలి.

'దేయం దీన జనాయచవిత్తం'. దీనులకు, దరిద్రులకు తనకున్నదానిలో కొంత యిచ్చి సాయము చేయవలెనని శాస్త్రములు హెచ్చరిస్తున్నాయి. ఆ విధంగా దానం చేయకుండా, అక్రమ, అనాచార, అవినీతి మార్గముల ద్వారా సంపాదించి కూడబెట్టిన లోభికి ఎప్పుడో ఒకప్పుడు అధోగతి తప్పదు. అంతేకాదు 'అదాన దోషే భవేద్దరిద్రః'. పూర్వజన్మలో దానం చేయపోవడం వలన ఈ జన్మలో దరిద్రులుగా పుడుతారు. ఈ జన్మలో దానం చేయనివారు వచ్చే జన్మలో దరిద్రులుగా పుడుతారు. దారిద్ర బాధకు తట్టుకోలేక పాపపు పనులు కూడా చేయడానికి ఏమాత్రం వెరువరు. ఆ విధంగా పాపపు పనులుచేయడం వలన వారికి నరకం ప్రాప్తిస్తుంది. కొంతకాలం అక్కడ నరక యాతనలు అనుభవించి తిరిగి దరిద్రుడుగా జన్మిస్తాడు. ఉదాహరణకు, బిచ్చగాడు మన ఇంటికి వచ్చి 'అమ్మా! ఆకలి! ఒక ముద్ద అన్నం పెట్టమ్మా!' అని జాలిగా ప్రాధేయ పడుతాడు. ఆ మాటలలోని అంతరార్థమును గ్రహించలేక 'దున్నపోతులా ఉన్నావు. పనిచేసుకొని బ్రతకరాదా! ఛీ వెళ్ళు' అని సహజంగా చీదరించుకుంటాము. బిచ్చగాని మాటల అంతరార్థమును అర్థం చేసుకుంటే మనకు అసలు విషయం బోధపడుతుంది. అదేమనగా "అమ్మా! గత జన్మలో మీలాగే, నేను కూడా సంపన్న కుటుంబానికి చెందినవాడనే. అయితే ఆకలితో అలమటిస్తూ నా ఇంటికి వచ్చి దేహీ! అని చేయిచాచిన వాడిని చీదరించుకొని వెళ్ళకొట్టాను. ఫలితంగా నాకు ఈ జన్మలో అడుక్కొని తినే గతి పట్టింది. మీకు కూడా ఆ గతి పట్టకూడదని హెచ్చరించడానికి వచ్చాను" అంటాడు బిచ్చగాడు.

దాన ధర్మాలకు వినియోగించిన డబ్బు ఇహమునందు పరమునందు కూడా తిరిగి వస్తుంది. స్నేహితులకు వినియోగించిన డబ్బు ఇహమునందు మాత్రమే తిరిగి వస్తుంది. భోగముల కొరకు దుర్వినియోగం చేయు డబ్బు ఇహమునందుగాని, పరమునందుగాని తిరిగిరాదని శాస్త్రములు చెబుతున్నాయి. కనుక తనుకున్న దానిలో విధిగా కొంత దానధర్మాలకు వినియోగించాలి.

- సాయిప్రియ

# బ్రిటీష్ పాలనలో గవర్నర్ పదవినలంకరించిన తొలి ఆంధ్రులు

బ్రిటీష్‌వారి కాలంలో తాత్కాలిక ప్రాతిపదికగా నయినా గవర్నర్లు అయిన ఘనత ముగ్గురు ఆంధ్రులకు దక్కింది. వారిలో మొదటివారు కూర్మా వెంకటరెడ్డి నాయుడు, కె.వి. రెడ్డి నాయుడుగా ప్రసిద్ధులు. వీరు 1936లో మద్రాస్ రాష్ట్రానికి యాక్టింగ్ గవర్నర్‌గా పనిచేశారు. రెండవవారు శొంఠి వెంకట రామమూర్తిగారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వానికి యుద్ధంలో సహాయ నిరాకరణ ప్రకటించి కాంగ్రెస్ మంత్రి వర్గాలు రాజీనామా చేసినప్పుడు మద్రాస్ ప్రెసిడెన్సీ గవర్నర్ పాలనకు వచ్చింది. అప్పుడు గవర్నర్‌కు సలహాదారుగా ఐ.పి.ఎస్. అధికారి రామమూర్తిగారు నియమితులయ్యారు. ఆ తర్వాత 1947 ప్రాంతంలో బొంబాయి రాష్ట్రానికి యాక్టింగ్ గవర్నర్‌గా నియమింపబడ్డారు. మూడవవారు ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు. మధ్య పరగణాలు (ఈనాటి మధ్యప్రదేశ్) ప్రెసిడెన్సీకి తాత్కాలిక గవర్నర్‌గా నియమితులయ్యారు. ఈ ముగ్గురిలో రెడ్డినాయుడుగారు రాజకీయవాది. మిగిలిన ఇద్దరు ఐ.పి.ఎస్. ఆఫీసర్లు.

1875లో రెడ్డి నాయుడు కోనసీమ కేంద్రం అమలాపురంలో జన్మించారు. ప్రాథమిక విద్య అమలాపురంలో పూర్తిచేసుకుని రాజమండ్రి ఆర్ట్సు కాలేజి నుంచి డిగ్రీ తీసుకుని తర్వాత మద్రాస్‌లో లా పూర్తిచేశారు.

రెడ్డి నాయుడుగారిది భారీ విగ్రహం. చామనఛాయ రంగు. వారిని చూడగానే చూచేవారికి భయం, భక్తి రెండూ కలిగేవి. వాగ్ధాటితోపాటు వాదనా చాతుర్యం ఆయన సొత్తు. 1900లో 25 సంవత్సరాల చిన్న వయసులో ఆయన రాజమండ్రి మున్సిపల్ ఛైర్మన్‌గా ఎన్నికయ్యారు. ఆంధ్ర భీష్మ న్యాపతి సుబ్బారావుగారు అంతకుపూర్వం ఈ పదవిని అధిష్టించారు. లా డిగ్రీ తీసుకున్న తర్వాత ఏలూరులో న్యాయవాదిగా ప్రాక్టీస్ ప్రారంభించారు. 1920లో మహాత్మాగాంధీ కాంగ్రెస్ క్రియాశీలక రాజకీయాలలో ప్రవేశించి వినూతనమైన శాంతి, అహింస పద్ధతులలో స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభించారు. కాంగ్రెస్ ప్రభంజనాన్ని ఎదుర్కొనడానికి తమ ప్రభుత్వం పట్ల విధేయతగల ఒక రాజకీయ పార్టీ అవసరమని బ్రిటీష్ పాలకులు భావించి తమ విధేయులతో జస్టిస్ పార్టీని స్థాపించారు.

ఆనాడు స్వాతంత్ర్య సంగ్రామానికి నాయకత్వం వహిస్తున్న కాంగ్రెస్ కేంద్ర నాయకులందరూ దాదాపు బ్రాహ్మణులే. తెలుగు కాంగ్రెస్ నాయకులందరూ బ్రాహ్మణులే. ఆ రోజులలో ఒక్క రాజకీయ రంగమేకాదు సాహిత్యాది అన్నిరంగాలు బ్రాహ్మణ నాయకత్వంలో

## కంచి వాసుదేవరావు

వుండేవి. అందువలన కాంగ్రెస్ నాయకత్వంలో జరుగుతున్న స్వాతంత్ర్య సమరాన్ని నీరు కార్చాలంటే బ్రాహ్మణ నాయకత్వంపై దెబ్బతీయాలి. బ్రాహ్మణ ద్వేషం కలిగించాలి. ఆర్యులు, ద్రావిడులువేరని, ఉత్తరాదివారు ఆర్య సంతతి కాగా దక్షిణాది వారు ద్రవిడ సంస్కృతికి చెందిన వారని ఈ రెండు సంస్కృతులూ భిన్నమైనవని ఒకదానితో ఒకటి పొసగవన్న సిద్ధాంతాన్ని ప్రచారం చేశారు. తమిళనాడులో బ్రాహ్మణ ద్వేషం. ఉత్తరాదిపై ద్వేషం. హిందీపై ద్వేషంగల పెరియార్‌వారి రామస్వామి నాయకన్ నాయకత్వంలో ఏర్పడిన ద్రవిడల కజగం పార్టీని ప్రోత్సహించారు. ఇది నాస్తికత్వాన్ని ప్రచారం చేసే పార్టీ. హిందూ దేవుళ్ళపై విషంగక్కే పార్టీ.

ఆంధ్రదేశంలో అటువంటి తీవ్ర భావాలుగల ఉద్యమం లేదు. అయితె బ్రాహ్మణాధిక్యాన్ని సహించక బ్రాహ్మణ ద్వేషాన్ని పెంచుకున్న కొన్ని కులాల నాయకులు వుండేవారు. వీరిలోంచి ప్రతి జిల్లా నుంచి కొందరు ధనం, పలుకుబడిగల వారిని; ముఖ్యంగా జమిందార్లు, పారిశ్రామిక వేత్తలు, జస్టిస్ పార్టీలోచేరి కాంగ్రెస్ నాయకత్వంలో జరుగుతున్న స్వాతంత్ర్య సమరంపై దెబ్బతీసే ప్రయత్నం చేశారు. కాంగ్రెస్‌పై బ్రాహ్మణులపై ద్వేషాన్ని రగిల్చడంతో పాటు బ్రిటీష్ ప్రభుత్వంపట్ల విధేయత కలిగివుండటం సామాన్య లక్షణాలు. ఈ లక్షణాలు పుణికి పుచ్చుకుని

స్థాపితం 1964
శ్రీ
నగలు
22C.T. బంగారు.
కవరింగ్
చేయబడినవి.
శ్రీ గోల్డు కవరింగ్ వర్క్సు®
PB No.135 శ్రీ మహల్, మచిలీపట్నం-2.

జస్టిస్ పార్టీలో ప్రముఖస్థానం వహించిన వారిలో వెంకటరెడ్డి నాయుడుగారు ఒకరు.

1935 భారత ప్రభుత్వ చట్టం క్రింద వివిధ రాష్ట్రాల శాసన సభలకు ఎన్నికలు 1937లో జరగడానికి ముందు పరిమిత ఓటింగ్ హక్కులలో లెజిస్లేటివ్‌గా కౌన్సిల్‌కు ఎన్నికలు జరుగుతూ వుండేవి. ఈ ఎన్నికలలో పాల్గొనడానికి కాంగ్రెస్ నాయకులకు పెద్దగా ఆసక్తి లేకపోవడం వలన జస్టిస్ పార్టీ వారే ఎక్కువగా ఎన్నికయి వారి నాయకుడు ప్రీమియర్ అయి రాష్ట్రాన్ని పాలించేవారు. ఆ విధంగా 1935కు పూర్వం జస్టిస్ పార్టీ మంత్రి వర్గాలు వుండేవి. ఆయన చట్టనిర్మాణ సభలలో ప్రవేశించి బ్రిటీష్ ప్రభుత్వంపై పోరాటం జరపాలన్న ఉద్దేశం కొందరు కాంగ్రెస్‌వాదులు ఎన్నికలలో పోటీచేసి గెలిచి లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో ప్రవేశించేవారు. వారిలో ఉద్దండులు సి.ఆర్.రెడ్డి, సత్యమూర్తి వంటివార్లు ఉండేవారు.

లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో రెడ్డి నాయుడు ప్రతిపక్ష నాయకులను సమర్ధవంతంగా ఎదుర్కొనగలవారి కోసం బ్రిటీష్ ప్రభుత్వం జస్టిస్ పార్టీ ద్వారా అన్వేషించింది. అట్టి వారిని కౌన్సిళ్ళకు పంపించేది. ఆ విధంగా లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికయిన వారిలో ఒకరు రెడ్డి నాయుడు.

1926 ప్రాంతంలో పానుగంటి రాష్ట్ర మద్రాస్ రాష్ట్ర ప్రీమియర్‌గా ఉండేవారు. ఆయన రాష్ట్రానికి ఎనలేని సేవ చేశారు. ఆయన ఆధ్వర్యంలోనే ఆంధ్ర విద్యాలయ అవతరణ జరిగింది. ఈ బిల్లు మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు విచారణకు వచ్చినప్పుడు విశ్వవిద్యాలయం పేరు ఆంధ్ర విశ్వవిద్యాలయంగాకాక తెలుగు విశ్వవిద్యాలయంగా వుండాలని సూచించారు. కాని ఏ కారణంవల్లనో అది ఆమోదింపబడలేదు. విశ్వవిద్యాలయ స్థాపనకు బెజవాడ వాల్తేరుకన్న రాజమండ్రి అనువుగా ఆదర్శప్రాయంగా వుంటుందని రెడ్డి నాయుడుగారు అభిప్రాయపడ్డారని విన్నాను. ఏది ఏమయితేనేం ఆంధ్ర విశ్వవిద్యాలయం అవతరించిన దాదాపు 60 సంవత్సరాలకు ఎన్టీరామారావు ప్రభుత్వ హయాంలో తెలుగు విశ్వవిద్యాలయం ఏర్పడింది. ఆంధ్ర రాష్ట్ర అవతరణకు కారణభూతుడైన పొట్టి శ్రీరాములు పేరిట ఈ విశ్వవిద్యాలయం ఇప్పుడు తెలుగు సాహిత్య సంస్కృతులకు విద్యాపీఠంగా పనిచేస్తూ వుంది. తెలుగు విశ్వవిద్యాలయం రాజమండ్రిలో ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి సమర్ధవంత నాయకత్వంలో పనిచేస్తోంది. ఆ విధంగా రెడ్డి నాయుడుగారి కలలు ఇప్పుడు నెరవేరాయి.

వెంకటరెడ్డి నాయుడు సమర్ధతను గ్రహించిన బ్రిటీష్ ప్రభుత్వం ఆయనకు ఎన్నో బాధ్యతలను అప్పగించింది. దక్షిణాఫ్రికాలో ఆయన భారత ప్రభుత్వ ఏజెంట్ జనరల్‌గా పనిచేశారు. ఆయన ఏ పదవిని చేపట్టినాదానికి న్యాయం చేకూర్చి అందరి మన్ననలు పొందేవారు.

ఆ రోజులలో దక్షిణ భారత దేశస్తులందరినీ మద్రాసీలనేవారు. మద్రాసీలంటే తమిళులు మాత్రమేనని ఒక అభిప్రాయం ఉండేది. ఇది శ్రీ రెడ్డి నాయుడికి బాధ కలిగించేది. ఆంధ్రులు, తమిళులు, కన్నడులు, మళయాలులు, ద్రావిడ కుటుంబానికి చెందినవారయినా, ప్రతివొక్కరినీ ఒక ప్రత్యేక సంస్కృతి సాంప్రదాయం వుందని వాటికి గుర్తింపు లభించాలని ఆయన కోరుకునేవారు.

జస్టిస్ పార్టీ బ్రాహ్మణ ద్వేషం ఆధారంగా అవతరించినా ఆయన యిట్టి సంకుచిత భావాలకు అతీతుడైన విశాల హృదయుడు. ఆయనకుగల గురు భక్తి అపారం. ఇందుకు ఉదాహరణగా ఒక ఉదంతాన్ని పెద్దలు చెప్పగా విన్నాను.

గురుభక్తి :

రెడ్డి నాయుడుగారు అమలాపురంలో ప్రాథమిక తరగతులు చదువుతూ వుండగా వడ్లమాని రామాచంద్రుడు అనేవారు దగ్గర వుండి శ్రద్ధగా పాఠాలు చెప్పేవారు. ఆ తర్వాత రెడ్డి నాయుడుగారు ఉన్నత విద్యనభ్యసించి రాష్ట్ర ప్రముఖుడై చివరకు మద్రాస్ రాష్ట్ర తాత్కాలిక గవర్నర్ అయ్యారు. గవర్నర్‌గా వుండగా అమలాపురం వెళ్ళి తన తొలిగురువుగారిని చూడాలన్న సంకల్పం కలిగింది.

ఆ రోజులలో అమలాపురానికి వెళ్ళాలంటే రాజమండ్రి లో గోదావరిదాటి ఆవతల గట్టునవున్న బొబ్బర్లంక నుంచి బస్సులో వెళ్ళవలసి వచ్చేది. కోనసీమలో అన్నీ ఇరుకులు, గతుకుల రోడ్లు రాజమండ్రి వద్ద 'ఫంట్ల' మీద కారులో గోదావరి దాటవలసి వచ్చింది. విమానం లాంటి గవర్నర్ కారులో రెడ్డి నాయుడుగారు గోదావరి దాటి అమలాపురం జేరుకున్నారు.

తన చిన్ననాటి గురువు పట్టణంలో ఏదో ఒక మారుమూల సందులో వృద్ధాప్యంతో కుచేలుని మించిన దీనావస్థలో జీవిస్తున్నారు. గవర్నర్‌గారి కారు అల్లంత దూరంలో ఆగిపోయింది రెడ్డి నాయుడుగారు కారు దిగారు.తన సూటుబూటు మొదలైన ఆడంబర వేషధారణను వదలివేసి లుంగీకట్టుకొని ఒక్క బనీను దానిపై కండువా మాత్రమే వేసుకుని గురువుగారి శిధిలావస్థలోవున్న పాకకు జేరుకున్నారు. గురువుగారి ముందు రెడ్డి నాయుడుగారు అక్షరాల సాష్టాంగపడి ఆయన పాదాలను స్పృశించి - "మాష్టారూ నేను ఈరోజు యింతవాడినయ్యానంటే అదంతా మీరు చిన్నప్పుడు చెప్పిన చదువు ఆశీర్వాదబలమే. నన్ను దీవించండి" అన్నారు. వడ్లమాని రామచంద్రుడుగారు వణకుతున్న చేతులతో కళ్ళలో నీళ్ళు తిరుగుతూ వుండగా శిష్యుని లేవనెత్తి ఆప్యాయంగా కౌగిలించుకుని ఆశీర్వదించారు. ఈ ఉదంతం వింటుంటే నాకు ఒళ్ళు గగుర్పొడిచింది.

తన గురువుగారి పేదరికాన్ని దీనావస్థను చూచి రెడ్డి నాయుడుగారు కళ్ళనీళ్ళు పెట్టుకుని తక్షణ ఆర్థిక సహాయం చేయడమేకాక ప్రతి నెలా వారికి క్రమం తప్పకుండా కొంత డబ్బు అందే ఏర్పాట్లు చేశారుట.

ఆ రోజులలో ఏ రాజకీయ పార్టీవారయినా ఏమతానికి చెందినవారయినా నాయకులు వ్యక్తిగతంగా మహోన్నతులుగా వుండేవారు నీతినిజాయితీ, నిష్కళంక శీలం, వారికి పెట్టని ఆభరణాలుగా ఉండేవి. అందుకనే వారు ఈనాటికీ చిరస్మరణీయులుగా ఆదర్శప్రాయులుగా ఉంటున్నారు.

రెడ్డి నాయుడుగారి కుమారుడు గోపాలస్వామి నాయుడు గారు ఆంధ్ర విశ్వవిద్యాలయం తొలి దశలో అనేక సంవత్సరాలు రిజిస్ట్రారుగా అమూల్యమైన సేవలు చేశారు. నాటక కళాభిమాని ఆంధ్ర నాటక కళా పరిషత్తు స్థాపనా రూపకల్పనా నిర్వహణలోనూ విశేష కృషి చేశారు.

## సుశ్లోకం

నేను చర్మమనే ఛందస్సు
కప్పుకున్న పద్యాన్ని
నాలుగు పాదాల
జీవ లక్షణంతో నడయాడే
ద్విపద జీవాన్ని!
సంధి సమాసాలంకారాల
జీవ వ్యాకరణంతో తయారైన
రసాభాస శిల్పాన్ని
ఆంతర్యాన్ని విడిచి
అన్నిటిని స్ఫురిస్తున్న
వాస్తవిక వస్తు ధ్వనిని
నా తాత్పర్యమేమిటో
నీకు తెలియనిదేమీ కాదు
సత్యం సౌందర్యం ధర్మం శాంతి
ప్రేమ త్యాగం ఎన్నెన్నో సుగుణాల్ని
గర్వంలో దాచుకొని
వినయాభినయంతో తిరుగుతున్న
తిరుగులేని కపటిని!
హే భగవాన్!
నీ కోసమని సాగుతున్న
ఈ ప్రయాణంలో రేగుతున్న
ధూళితో పరమాకాశం
చీకటిలో కూరుకుపోతూవుంది
ఈ కవచాన్ని ఛేదించు
అమూల్యమైన ఆశారత్న దీపంతో
నన్నొక శ్లోకంలా వెలిగించు!!

- డాక్టర్ ఆచార్య తిరుమల, హైదరాబాద్

# కరుణశ్రీ

## సి. వేదవతి

"కవిత్వం ఒక కమ్మని అనుభూతి. మానవత్వంలో నవత్వం చూపించే ఆశాజ్యోతి అది-జీవిత విపంచి మేళవించి మ్రోగించిన కళ్యాణ గాంధర్వగీతి" కవిత్వానికి ఇంత రసనిర్భరమైన వ్యాఖ్యానం చెప్పుకొన్న కవి-కరుణశ్రీ. తన జీవన విపంచిని కవితోపాసనతో పలికించి, రససిద్ధుడైన కవి-కరుణశ్రీ. ఆధునికాంధ్ర పద్యప్రపంచాన్ని రసవత్తర రచనలతో సుసంపన్నం చేసిన భావుకకవి, కరుణశ్రీగా సుప్రసిద్ధుడైన శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి వ్యక్తిత్వ లక్షణం లోనూ, కవితా తత్త్వంలోనూ కారుణ్యాన్ని ప్రతిష్ఠించు కొన్న కవి. కరుణలో పుట్టి, కరుణలో పెరిగి, కరుణలోనే విలీనమయ్యే ప్రకృతి తత్త్వాన్ని దర్శించి కరిగి కరిగి కవిత్వం చెప్పిన కవి-కరుణశ్రీ.

బుద్ధ భగవానుడు, క్రీస్తు ప్రభువు, గాంధీ మహాత్ముడు ఈ ముగ్గురు అహింసామూర్తులూ ఆయనకు ఆదర్శ మూర్తులు. కనుకనే, ఆయన కావ్యాలన్నిటిలో అంత స్సూత్రమైనిలిచే జీవనాడి - కారుణ్యభావమే!

ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ-వంటి కరుణశ్రీ కృతులు తెలుగు సాహితీ లోకాన్ని రసవదానందంతో ముంచెత్తి ఉర్రూత లూగించాయి. "ఉదయశ్రీ నాహృదయం - విజయశ్రీ నా శిరస్సు - కరుణశ్రీ నా జీవితం-" అనటంలో కవికీ - కవితా ప్రకృతికీ ఎంతటి మేళవింపు సిద్ధించిందో మనకు విశదం అవుతుంది.

కురుక్షేత్ర యుద్ధానికి పాండవులు సన్నద్ధులు కావడం కావ్యవస్తువుగా "విజయశ్రీ" కావ్యం అవతరించింది. "లెమ్ముధనంజయా! విధిబలీయము! న్యాయము గెల్చు, నిల్చుసత్యమ్ము; నశించు స్వార్థము;-సదా యుగధర్మమిదే గదోయి ఇట్లా మామూలు మాటల్లోనే పద్యం నిర్మించి, రసతరంగాలు సృష్టించగల శిల్పచాతురి కరుణశ్రీకి వెన్నతో అలవడిన విద్య.

కరుణామయుడైన గౌతమబుద్ధుని జీవితగాథను చిత్రించిన రసవద్రచన 'కరుణశ్రీ' కావ్యం. విశ్వమానవ కళ్యాణం కోసం తపిస్తూ, అర్ధాంగినీ, కుమారుణ్ణీ వదలి అర్ధరాత్రి వేళ సిద్ధార్థుడు మహాభినిష్క్రమణం చేయటాన్ని కవి పరమార్థంగా దర్శించి రచించిన కరుణ రసకావ్యం ఇది. కరుణశ్రీ ప్రప్రథమంగా రచించిన ఖండ కావ్యసంపుటి ఉదయశ్రీ తరువాత అయిదు భాగాలుగా విస్తరించి సుమనోజ్ఞములైన కవితా ఖండికలతో సమగ్ర సంపుటిగా వెలువడిన కావ్యం ఇది. ఒకపాటి కవితా స్పృహ కలిగి పద్యం చదవగలిగిన తెలుగువారి నోళ్లలోనాని, బహుళ ప్రచారం పొందిన పద్యాలు ఈ సంపుటి లోనివే.

అద్వైతమూర్తి, సాంధ్యశ్రీ, పుష్పవిలాపము, కుంతీ కుమారి, ధనుర్భంగము, ఊర్మిళాకుమారి, అనసూయాదేవి, సతీసావిత్రి వంటి రసరమ్య కవితాచిత్రాలు తెలుగు సాహితికి భవ్యమైన అలంకారాలుగా అవతరించాయి. తిరుపతి కవుల తర్వాత, తెలుగు రసజ్ఞలోకం అంతగా ఆదరించిన పద్యాలు కరుణశ్రీవి అనటంలో అతిశయోక్తి లేదు. ఘంటసాల మధుర గానంతో కరుణశ్రీ కవితాకుమారి ప్రతిమల గాంధర్వ రూపంలో ఇంటింటా ప్రతిధ్వనించింది. ప్రతి గుండెలోనూ మారుమ్రోగింది. చూచెదవేలనో ప్రణయసుందరి! కాటుక కళ్లలోని ఆలోచన లేమిటో హరిణలోచని! అంటూ ప్రణయ భావోత్కర్షను, అందంగా ఆవిష్కరించినా,

**"ఒత్తుగా పూలగుత్తుల వెత్తుపెట్టి**
**పై చెరగు చింపి మెత్తగా ప్రక్కపరచి"**

బిడ్డను గంగానదికి ఒప్పగించే కన్నతల్లి కుంతీ కుమారి గుండెలలోని ఆవేదనను చిత్రించినా,

**"నాథు నెడబాసి శూన్యమౌ నగరిలోన**
**నెట్లు నిలిచెదు? పదునాలుగేండ్లు తల్లి!"**

**అంటూ** ఊర్మిళాకుమారి వియోగ దుఃఖాన్ని ఊహించినా,

**"ఊలు దారాలతో గొంతు కురిబిగించి**
**గుండెలో నుండి సూదులు గ్రుచ్చి కూర్చి"**

హింసింపబడే పూల బాలల గురించి జాలిపాట పాడినా 'పాకీదానిగ' నాడి పోసుకొను ఈ పాపిష్టి లోకమ్ము 'నీబాకీ' తీర్చుకొనంగ లేదు జగదంబా! జన్మజన్మాలకునే"! అంటూ పాకీ పిల్లమీద కరుణామృత వర్షం కురిపించి ఆమెను 'జగదంబ'గా సంభావించినా ఒక్క మహనీయార్థాన్ని మహిత సుందరంగా చెప్పడం కరుణశ్రీ కవితలోని జీవలక్షణం! సుకుమారమైన భావసంపద అపురూపమైన శబ్దలాలిత్యం కలగలపుగా సాక్షాత్కరించుకొన్న కవితా తపస్సంపన్నుడు కరుణశ్రీ.

Phone : 87215
S.T.D. : 08555

మంచి అవకాశము

# శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్

పుట్టపర్తి, అనంతపురం జిల్లా.



మీకు పుటపర్తి యందు ప్లాట్లు, ఇండ్ల స్థలములు
కావలసినవారు, అమ్మదలచినవారు
ఈ క్రింది అడ్రస్సుకు సంప్రదించవలెనని కోరడమైనది.

- సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు
- గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు
- M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు
- బీడుపల్లికిపోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు
- అపార్ట్‌మెంట్స్ కావలసినవారు
- ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు
- పుట్టపర్తి రైల్వేస్టేషన్ ఎదురుగా గల ప్లాట్లు

ఇట్లు
శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్
ప్రొ॥ పి. సిద్దయ్యశెట్టి
ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్
ఆర్యవైశ్యసత్రం ఫ్రంట్‌రూమ్, పుట్టపర్తి - 515 134.

Postal Registered
No.H/M.P.M./34, Dt 10-12-1984

SREEVANI
JULY 2000

Regd. with Registrar of News
Papers Regd. No. 45039/85




## [illegible] Sadan (Meda's Guest House)

SBI- Hanuman Temple, Main Road, Puttaparthi - 515 134
Ananthapur Dist. (A.P.) India

Phones . 08555-87890, 87891, 87892, 87507, Fax · 08555-87508; Grams . "MEDA

1. **Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bedroom, sitout and attached Toilet.**
2. **Every suit is equipped with Fridege, Telephone, Geyser.**
3. **Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.**
4. **Air-conditioned suits are also available.**
5. **A pure Vegetarian Restaurant with South Indian, North Indian & Continental Dishes.**
6. **S.T.D., I.S.T.D., FAX facilities.**
7. **A Doctor on call**
8. **Safety Lockers.**
9. **Ample Parking space.**
10. **Prompt service and best facilities at affordable Tariff.**

### Registered Office:

6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004
Phones : Off.3394320, 3313796; Res.3313796 (STD 040) Fax·040-3394320

EDITED, PRINTED AND PUBLISHED BY **SRI KOMARAGIRI KRISHNA MOHAN RAO**
*Printed at Sreevani Offset Printers, Machilipatnam - 521 001. Ph: 21137*